అశోక శాసనాలలో, సామాన్యంగా, కాలం ఈ క్రింది విధంగా తెలుపడం జరిగింది.

"ద్వాదస వాసాభిసితేన మయా ఇదం ఆణాపితం"
(3వ శిలాశాసనం, గిర్నార్)

"నా రాజ్యాభిషేక మయిన పండ్రెండో సంవత్సరాన ఇది ఆజ్ఞాపింప బడింది"

"తే దస వసాభిసితేనా మమయా ధంమ మహామాతా కటా"
(5వ శిలాశాసనం, కాల్సీ)

"నా రాజ్యాభిషేకం కాలం పదమూడో ఏట ధర్మ మహ మాత్రులు ఏర్పాటు చేయబడినారు"

ఇట్టి వాక్యాలలో చెప్పిన ఏండ్లు జరిగిపోయిన ఏండ్లా, జరుగుచున్న ఏండ్లా? "పండ్రెండో సంవత్సరాన" అన్నప్పుడు పండ్రెండేడ్లు పూర్తి అయినట్లు గ్రహించాలా, లేక పదకొండు ఏండ్లు పూర్తి అయి వర్త మానంలో పండ్రెండవ ఏడు జరుగుతున్నదని గ్రహించాలా అని వెనుకలో అనుమానం ఉన్నప్పుడు, పండితులలో కొందరు ఇవి గతాబ్దా లని మరికొందరు వర్తమానాబ్దాలని అభిప్రాయపడటం జరిగింది కాని 1958లో కందహార్‌వద్ద అశోకుని గ్రీక్-అరమైక్ ద్విభాషా శాసనం దొరికిన తర్వాత ఈ అనుమానం తీరి పోయింది. గ్రీకు భాషలోని, దానికిచ్చిన ఆంగ్లానువాదం ప్రకారం, శాసనం ఇట్లా మొదలవుతుంది.

"టెన్ యియర్స్ హ్యావింగ్ ఎలాప్స్‌డ్ (ఫ్రం హిస్ ఇన్‌స్టల్లేషన్ కింగ్ పియోదస్సెస్ హ్యాస్ షోన్ మ్యాన్‌కైండ్ (ది వే టు) పయటీ"

"పదేండ్లు (తన పట్టాభిషేకం నుంచి) గడచిపోయిన తర్వాత ప్రియదర్శిరాజు మానవులకు ధర్మ మార్గాన్ని తెలియచేశాడు"

అరమైక్ భాషలో కూడా ఇట్లానే చెప్పబడిఉంది ఈ శాసనాన్ని బట్టి, అశోక శాసనాలలో పేర్కొన్న అభిషిక్త వత్సరాలు గతాబ్దాలనేది స్పష్టం; ఈ అభిప్రాయాన్ని పండితులందరూ ఆమోదించారు.

“నేను రాజ్యాభిషిక్తుడనైన పంద్రెండవ సంవత్సరంలో...ఈ ధర్మ విపులు నా చేత లిఖింపబడిన”వని, రాజ్యాభిషిక్త వత్సరం 26వ ఏట (క్రీ. పూ 268-26 = 242) లిఖించిన ఆరో స్తంభ శాసనాంలో అశోకుడు చెప్పిఉన్నాడు. అందుచేత అశోక శాసనాలన్నీ క్రీ పూ 268-12 = 256 తర్వాతనే లిఖించబడినాయి.

అశోకుడు మొదట లఘు శిలాశాసనాలను, అటుతర్వాత బృహత్ శిలాశాసనాలను ప్రకటించాడు మొదటి లఘు శిలాశాసనంలో తాను బౌద్ధుడై రెండున్నర సంవత్సరాలు పైగా కావచ్చిందని తెలిపాడు. 13వ శిలాశాసనం అశోకుడు పట్టాభిషిక్తుడైన ఎనిమిదో ఏట, క్రీ పూ. 260 (268-8) లో, కళింగాన్ని జయించినట్లు తెలుపుతుంది కళింగాన్ని జయించిన తర్వాత అతి కొద్దికాలంలోనే, ఆరు నెలలకు లోపలనే అశోకుడు బౌద్ధమత స్వీకారం చేసినట్లు అనుకోవలె ఎందువల్లనగా పట్టాభిషిక్తుడైన పదో ఏట, క్రీ. పూ 258 లో, సంబోధి నగరం అంటే గయకుపోయి, మృగయా వినోద యాత్రలను వదలి, తన ధర్మయాత్రలను ప్రారంభించినట్లు తెలిపాడు. మొదటి లఘు శిలాశాసనంలో తాను బౌద్ధుడై రెండున్నర ఏండ్లయినా తాను బౌద్ధ ధర్మంలో ఎట్టి ఉత్సాహం చూపలేదని, ఒక ఏడాది కిందట సంఘాన్ని దర్శించింది మొదలు మిక్కిలి ఉత్సాహవంతుడనై ధర్మాచరణకు పూనుకొన్నానని అశోకుడు తెలిపాడు. దీనినిబట్టి సంఘాన్ని దర్శించి ఉత్సాహం పొందిన తర్వాత, ధర్మాచరణంలో ఒక భాగంగా మొదటగా గయకు ధర్మయాత్ర

చేసినట్లున్నది. అంతేగాక, ఈ మొదటి లఘు శిలాశాసనంలోనే తన ధర్మ శ్రావణాలను అంటే ధర్మ శాసనాలను శిలలపై, స్తంభాలపై చెక్కించవలెననే తన ఉద్దేశాన్ని మొదటిసారిగా వ్యక్తం చేసి వున్నాడు. "సమయం దొరికినప్పుడంతా ఈ అర్థాన్ని (అంటే ధర్మాన్ని) శిలలపై చెక్కించుడు శిలాస్తంభాలు ఉన్నచోట్ల అంతా శిలాస్తంభాలపై దీనిని చెక్కించవలెను" (లఘు శిలాశాసనం - రూపనాడ్). మొదటి లఘు శిలాశాసనంలో చెప్పిన ఈ విషయాలన్నీ అశోకుడు తన శిలాశాసన ప్రకటనను, క్రీ పూ 256లో, లఘు శిలాశాసన ప్రకటనతోనే ప్రారంభించాడనే విషయాన్ని స్పష్టం చేస్తాయి. ఎర్రగుడి, బ్రహ్మగిరి మొదలయిన కొన్నిచోట్ల మాత్రమే లభ్యమయిన రెండో లఘుశిలాశాసనంలో, తరువాత బృహత్ శిలాశాసనాలలో, స్తంభ శిలాశాసనాలలో తాను విపులీకరించిన ధర్మాన్ని, అశోకుడు క్లుప్తంగా, రేఖామాత్రంగా తెలపడం కూడా ఈ అభిప్రాయాన్ని బలపరుస్తుంది. తన పట్టాభిషేకంనుంచి పదేండ్లు పూర్తిఅయిన తర్వాత ప్రియదర్శిరాజు ప్రజలకు ధర్మమార్గాన్ని తెలిపాడు అని, కందహార్‌వద్ద లభించిన అశోకుని గ్రీక్ - అరమైక్ ద్విభాషా శాసనం చెప్పటంకూడా ఈ అభిప్రాయాన్ని బలపరుస్తుంది

బృహత్ శిలాశాసనాలలో మూడు శాసనాలలో మాత్రమే వాని ప్రకటనాకాలం తెలుపబడింది మూడో శాసనం రాజ్యాభిషేకమయిన పన్నెండో సంవత్సరాన ఆజ్ఞాపించ బడినట్లు, నాల్గో శాసనం ఆదే సంవత్సరాన లిఖించబడినట్లు, ఆ శాసనాలలోనే చెప్పబడింది అంటే, ఈ రెండు శాసనాలు క్రీ. పూ. 268-12 = క్రీ. పూ 256లో ప్రకటించ బడినాయి. అయిదో శిలాశాసనంలో రాజ్యాభిషేకకాలం పదమూడోఏట, క్రీ. పూ. 268-13 = క్రీ పూ. 255లో ధర్మ మహామాత్రులను ఏర్పాటు చేసినట్లు చెప్పబడింది. ఆ శాసనాన్ని అదే ఏటనో, లేక మరు సంవత్సరమైన క్రీ. పూ. 254 లోనో లిఖించి ఉండాలి 13 వ శిలాశాసనంలో

పేర్కొన్న యవన (గ్రీకు) రాజులకు అశొకునితోఉన్న సమకాలీనతను బట్టి ఆ శాసనం క్రీ. పూ. 255-54 తర్వాత లిఖించబడి ఉండటానికి వీలులేదు. అందుచేత అశోకుని పద్నాలుగు బృహత్ శాసనాలు క్రీ పూ. 256 నుంచి క్రీ పూ. 254 వరకు గల మధ్యకాలం రెండేండ్లలో ప్రకటించటం జరిగిందని చెప్పవచ్చు ఆ శాసనాలలోని ఇతివృత్తంలో, రచనా సంవిధానంలో ఉన్న ఐక్యం కూడా ఈ అభిప్రాయాన్నే సమర్థిస్తుంది.

బృహత్ శిలాశాసన ప్రకటన తర్వాత పంద్రెండేడ్లు అశోకుడు మరెట్టి శిలాశాసనాలు వేయించినట్లులేదు ఆ తరువాత క్రీ పూ 242లో ఆరు స్తంభశాసనాలు ప్రకటించినట్లు తెలుస్తుంది. ఒకటి, నాలుగు, అయిదు, ఆరు స్తంభశాసనాలు రాజ్యాబిషిక్త కాలం ఇరవై ఆరోఏట, (క్రీ. పూ. 268-26) = క్రీ పూ 242లో లిఖించబడినట్లు ఆ శాసనాలలోనే చెప్పబడి ఉంది రెండవ, మూడవ స్తంభ శాసనాలను కూడా అదే సంవత్సరం ప్రకటించారనేది నిస్సంశయం ధర్మాచరణలో, ధర్మప్రచారంలో, ధర్మవ్యాప్తిలో తాను చేసినకృషికి, సాధించిన పలితాలకు అశోకుడు కావించిన సమీక్షగా చెప్పదగిన ఏడో స్తంభశాసనం, రాజ్యాభిషిక్త కాలం ఇరవై ఏడోఏట, క్రీ పూ. 268-27 = క్రీ పూ 241లో లిఖించబడినట్లు శాసనమే తెలుపుతుంది ఈ శాసనం చివరలో "నేను రాజ్యాభిషిక్తుణ్ణి అయిన ఇరవై ఏడో సంవత్సరంలో ఈ ధర్మలిపి నాచేత లిఖించబడింది"అనిచెప్పి, అశోకుడు వెంటనే "దీని విషయంగా దేవానాంప్రియుడు చెప్పుచున్నాడు ఈ ధర్మలిపి చిరస్థాయి అయి ఉండటానికి శిలా స్తంభాలు కాని, శిలాపలకాలు కాని దొరకెడి చోట్లలో అంతా లిఖించబడాలి" అని చెప్పి ఉన్నాడు కాని ఈ ఏడో స్తంభశాసనం ఒక్క ఢిల్లీ-తోప్రా శిలాస్తంభం పైననే కానవస్తుంది. ఏడో శిలాశాసన ప్రకటన తర్వాత అశోకుడు సుమారు పదేళ్ళు, క్రీ. పూ 232-31 వరకు,

పాలించాడు ఈ పదేళ్ళలో,- అశోకుడు శాసించిన ప్రకారం, ఈ ఏడో శిలాశాసనం ఇతర స్తంభాలమీద కాని, పలకాల మీదకాని రాయక పోవుటకు కల కారణము ఆలోచించవలసి ఉంది

చిన్న స్తంభశాసనాలు, సాంచీ, సార్నాథ్ శాసనాలు, కౌశాంబీ స్తంభశాసనం, - బౌద్ధ సంఘం విడదీసినవారికి వేయవలసిన శిక్షను గూర్చి చెప్తాయి వీనిలో ఎక్కడా కాలం తెలుపబడలేదు. మూడో బౌద్ధ సంగీతి పాటలీపుత్రంలో సమావేశమయిన తర్వాత ఆ సమావేశం తీసుకొన్న నిర్ణయాల మేరకు, అశోకుడు ఈ శాసనాలను జారీచేసి ఉండ వచ్చునని పండితులు అభిప్రాయ పడినారు ఈ సంగీతిని అశోకుడు, ధర్మవ్యాప్తిలో తాను కావించిన కృషిని సమీక్షించిన ఏడో స్తంభశాసనం (క్రీ పూ 241) లో పేర్కొనలేదు. ఈ మూడో బౌద్ధ సంగీతి క్రీ పూ. 240లో సమావేశమయి ఉండవచ్చునని భావించటమయింది అందు చేత పై స్తంభశాసనాలు క్రీ పూ 240 లోనొ, ఆటు తర్వాత కొద్ది కాలంలోనొ ప్రకటించబడి ఉంటాయి.

పైన పేర్కొన్న చిన్న స్తంభ శాసనాల కోవకే చెందిన రుమ్మిందయ్ స్తంభశాసనం. అ శాసనంలోనే చెప్పినట్లు, అశోకుని రాజ్యాభిషిక్త కాలం ఇరవయ్యో సంవత్సరాన, క్రీ పూ. 268-20 = క్రీ పూ 248న వేయబడింది దీనితోపాటే వేయబడింది నిగలీసాగర స్తంభశాసనము

బారాబర్ గుహశాసనాలలో, రెంటిలో, అవి,అశోకుడు అభిషిక్తుడైన పండ్రెండో ఏట, క్రీ పూ. 268-12 = క్రీ పూ.256లో, అజీవకులకు ఇచ్చినట్లు తెలుపబడింది, మూడో గుహ, పందొమ్మిదోఏట, క్రీ. పూ. 268-19 = క్రీ.పూ. 249లో ఆజీవకులకు ఇచ్చినట్లు తెలుపబడింది

అశోకుని జీవితంలో కొన్ని సంఘటనలు - వాని కాలము

అశోక శాసనాలు అశోకుని జీవితంలోని కొన్ని సంఘటనలను పేర్కొని వాని కాలాన్ని తెలిపాయి అశోకుడు పట్టాభిషిక్తుడైన ఎనిమిదో ఏట, క్రీ పూ. 268-8 = క్రీ. పూ 260లో, కళింగరాజ్యం అతనిచే జయించబడినట్లు 13వ శిలాశాసనం చెప్తుంది పట్టాభిషిక్తుడైన పదోఏట, క్రీ. పూ. 268-10 = క్రీ. పూ. 258లో అశోకుడు సంబోధికి (గయకు) దర్మయాత్ర చేసినట్లు 8వ శిలాశాసనం చెప్తుంది పండ్రెండోఏట, క్రీ శ 268-12 = క్రీ శ. 256లో ధర్మలిపులు (ధర్మ శాసనాలు) లిఖించినట్లు ఆరో స్తంభశాసనం తెలుపుతుంది క్రీ. శ. 268-13 = క్రీ. శ 255లో ధర్మమహామాత్రులనే కొత్త ఉద్యోగులను నియామకం చేసినట్లు అయిదో శిలాశాసనం చెప్తుంది క్రీ శ. 268-20 = క్రీ. శ. 248లో అశోకుడు బుద్ధుని జన్మస్థలమైన లుంబినీ గ్రామాన్ని దర్శించినట్లు రుమ్మిందై స్తంభశాసనంవల్ల తెలుస్తుంది. నిగలీసాగర స్తంభశాసనం వల్ల, అశోకుడు రాజ్యాభిషేక కాలం పద్నాల్గో సంవత్సరం క్రీ శ. 268-14 = క్రీ శ 254లో ఒకసారి, ఇరవయ్యో సంవత్సరం, క్రీ శ 268-14 = క్రీ. పూ. 248లో మరొకసారి లుంబినీ గ్రామానికి సమీపంలో ఉన్న కనకముని బుద్ధుని స్తూపాన్ని అశోకుడు దర్శించి, దానిని విస్తరింపచేసి, పూజించినట్లు, నిగలీసాగర (నిగ్లీవా) స్తంభం తెలుపుతుంది

అశోకుని కందహార్ గ్రీక్ - అరమైక్ ద్విభాషా శాసనంవల్ల అతడు పట్టాభిషేకంనుంచి పదేండ్లు గడచిన తర్వాత, అనగా, క్రీ పూ. 268-10 = క్రీ. పూ 258 తర్వాత, మానవులకు ధర్మబోధ చేయటం ప్రారంభించినట్లు తెలుస్తుంది.ఈ ధర్మబోధ చేసే ప్రయత్నంలో ముఖ్యమయిన సాధనాలుగానే అశోకుడు తన పండ్రెడో పాలనా సంవత్సరంలో

శిలాశాసనాలను సామ్రాజ్యవ్యాప్తంగా ప్రకటించటం జరిగింది

పై చర్చనుబట్టి అశోక శాసనాల కాలక్రమాన్ని, అశోకుని జీవితంలో కొన్ని సంఘటనలను, అశోకుని రాజ్యాభిషేక సంవత్సరం క్రీ పూ 268 గా గ్రహించి, పట్టీ రూపంలో ఈ కింది విధంగా క్రోడీకరించవచ్చు

## శాసనాల కాలక్రమం

| | | |
|---|---|---|
| లఘు శిలాశాసనాలు 1, 2 | క్రీ పూ | 256-255 |
| బృహత్ శిలాశాసనాలు | ,, | 256-254 |
| బారాబర్ గుహాశాసనాలు 1, 2 | ,, | 256-255 |
| బారాబర్ గుహాశాసనం 3 | ,, | 249-248 |
| రుమ్మిందయ్ స్తంభశాసనం | ,, | 248-247 |
| నిగలీసాగర్ (నిగ్లీవా) స్తంభశాసనం | ,, | 248-247 |
| స్తంభ శాసనాలు 1 నుండి 6 | ,, | 242-241 |
| రాణీ స్తంభశాసనం | ,, | 241-240 |
| ఏడో స్తంభ శాసనం | ,, | 241-240 |
| చిన్నస్తంభశాసనాలు (సాంచీ, సార్నాథ్, కోశం) | ,, | 240-239 |

## జీవిత సంఘటనలు

| | | |
|---|---|---|
| కళింగ యుద్ధం (13వ శిలాశాసనం) | క్రీ పూ. | 260 |
| బౌద్ధమత స్వీకారం (లఘు శిలాశాసనాలు) | ,, | 260-259 |
| గయకు ధర్మయాత్ర (8వ శిలాశాసనం) | ,, | 258 |
| ధర్మవ్యాప్తికి పూనుకొనుట (కందహార్ శాసనం) | ,, | 258 |
| అజీవక సన్యాసులకు బారాబర్ గుహలు 1, 2 అంకితం చేయుట | ,, | 258 |
| ధర్మ మహామాత్రుల నియామకం (5వ శిలాశాసనం) | ,, | 255 |

| | | |
|---|---|---|
| ప్రతివేదకుల ('రిపోర్టర్ల') నియామకం (6వ శిలాశాసనం) | క్రీ పూ. | 255-254 |
| కనకముని బుద్ధుని స్తూపానికి యాత్ర (నిగ్లీవా శాసనం) | ,, | 254 |
| అజీవక సన్యాసులకు బారాబర్ గుహ 3 అంకితం చేయుట | ,, | 249 |
| బుద్ధుని జన్మస్థలమైన లుంబినీ గ్రామానికి యాత్ర (రుమ్మిందై శాసనం) | ,, | 248 |
| కనకముని స్తూపాన్ని రెండోసారి దర్శించుట (నిగ్లీవా శాసనం) | ,, | 248 |

అశోకుడు క్రీ పూ 240-39 తర్వాత ఎట్టి శాసనమూ వేయించి నట్టు నేటికి తెలియరాలేదు అశోకుని పాలనా కాలాన్ని హిందూ పురాణాలు 36 ఏండ్లని, బౌద్ధ గ్రంథాలైన మహావంశం, దీపవంశం 37 ఏండ్లని పేర్కొంటాయి. అందుచేత అశోకుని పాలన క్రీ పూ (268-36/37) = క్రీ పూ. 232/231 లో సమాప్తం చెందింది.

## సూచికలు


1. హెన్నింగ్, బులెటిన్ ఆఫ్ ది స్కూల్ ఆఫ్ ఓరియంటల్ అండ్ ఆఫ్రికన్ స్టడీస్, 1949, పార్ట్ 1, పు 80, రొమిలాథాపర్, అశోకా అండ్ ది డిక్లైన్ ఆఫ్ ది మౌర్యాస్, పు 7.
2. ఎపిగ్రాఫియా ఇండికా (ఎపి. ఇం), సం 34, పు. 1-8 లు
3. ఎపి ఇం, సం. 37, పు 193-200
4 డి. సి. సర్కార్ (సం) "ఎర్రగుడి ఎడిక్ట్స్ ఆఫ్ అశోకా", ఎపి. ఇం, సం. 32, పు. 1-28 లు.

5. రిత్తి యస్ "జర్నల్ ఆప్ ది ఎపిగ్రాఫికల్ సొసైటీ ఆఫ్ ఇండియా" సం. 7
6. డి. సి. సర్కార్, "అశొకన్ స్టడీస్" (కలకత్తా, 1979), పే. 55-56.
7 డి. సి. సర్కార్ (సం) "ఎర్రగుడి ఎడిక్ట్స్ ఆఫ్ అశోకా", ఎపి. ఇండి సం 32, పు. 1-28లు

## కొన్ని ఉపయుక్త వ్యాసాలు, గ్రంథాలు


వ్యాసాలు . (ఇంగ్లీషు)

జి. బూలర్ (సం) "అశోకాస్ రాక్ ఎడిక్ట్స్ అకార్డింగ్ టు గిర్నార్, షాబాజ్‌గఢీ, కాల్సీ అండ్ మన్సెహ్రా వెర్షన్స్", ఎపి ఇండి, సం. 2, పు. 447-72లు.

జి. బూలర్ (సం) "ది అశోకా పిల్లార్ ఎడిక్ట్స్ ఆఫ్ పడరియా (రుమ్మిందై) అండ్ నిగ్లివ" ఎపి ఇండి, సం 5, పు. 1-6లు.

ఇ హెర్జ్‌ఫీల్డ్ (సం) "ఎ న్యూ అశోకన్ ఇన్‌స్క్రిప్షన్ (ఇన్ అరమైక్) ఫ్రం టాక్సిల" ఎపి. ఇండి, సం 19, పు 251-53.

డి. సి. సర్కార్ (సం) "గుజ్జర ఇన్‌స్క్రిప్షన్ ఆఫ్ అశోకా" ఎపి. ఇండి, సం. 31, పు. 205-10 లు.

"రాజుల-మండగిరి ఇన్‌స్క్రిప్షన్ ఆఫ్ అశోకా" ఎపి. ఇం: స. 31, పు. 211-18 లు.

"ఎర్రగుడి ఎడిక్ట్స్ ఆఫ్ అశోకా" ఎపి. ఇండి. సం. 32 పు. 1-28 లు.

"సోపారా ఫ్రాగ్‌మెంట్ ఆఫ్ రాక్ ఎడిక్ట్ నైన్ ఆఫ్ అశోకా" ఎపి. ఇండి. సం. 32, పు. 29-30 లు.

"ఫ్రాగ్‌మెంటరీ పిల్లార్ ఇన్‌స్క్రిప్షన్ ఫ్రం అమరావతి" ఎపి. ఇండి. సం. 35, పు 40-43 లు.

"న్యూ ఢిల్లీ ఇన్‌స్క్రిప్షన్ అఫ్ అశోకా" ఎపి ఇండి. సం. 38 పు. 1-4.

జె ఫిలియోజా (సం). "గ్రీకో-అరమైక్ ఇన్‌స్క్రిప్షన్ అఫ్ అశోకా నియర్ కందహార్" ఎపి ఇండి. సం. 35, పు, 1-3 లు.

డి. ష్లుంబెర్గర్, ఇ. బెవెనిస్ట్(సం)"ఎ న్యూ గ్రీక్ ఇన్‌స్క్రిప్షన్ ఆఫ్ అశోకా ఎట్ కందహార్" ఎపి. ఇండి. సం. 37, పు. 193-200 లు.

గ్రంథాలు . (ఇంగ్లీషు)

రొమిలా దాపర్ అశోకా అండ్ ది డిక్లైన్ ఆఫ్ ది మౌర్యాస్. ఆక్స్‌ఫర్, 1973.

డి సి సర్కార్ : అశోకన్ స్టడీస్, కలకత్తా, 1979.

నీలకంఠశాస్త్రి, కె.ఎ.. ఏజ్ అఫ్ ది నందాస్ అండ్ మౌర్యాస్, డిల్లీ, 1967. (సెకండ్ ఎడిషన్)

అర్ కె. ముఖర్జీ . "అశోకా", 1928", ఆశోకన్ ఇన్‌స్క్రిప్షన్స్-ఎకామెంటరీ, 1942.

తెలుగు

నారాయణరావు చిలుకూరు. అశోక ధర్మశాసనాలు, 1928.



# వివృతి

## సనాతనధర్మం - అశోకధర్మం

ధర్మ స్వభావాన్ని, సనాతన ధర్మ స్వరూపాన్ని అర్ష గ్రంథాలు ఇట్లా నిర్వచించాయి.

'విద్వద్భి స్సేవితం సద్భిర్నిత్యమద్వేషరాగిభిః,
హృదయేనాభ్యనుజ్ఞాతో యో ధర్మస్తం నిబోధత'
— మనుస్మృతి, 2:1

'సత్యం బ్రూయా త్ప్రియంబ్రూయాత్
నబ్రూయా త్సత్య మప్రియమ్,
ప్రియం చ నానృతం బ్రూయాత్
ఏష ధర్మ స్సనాతనః'
—మనుస్మృతి, 4:138

'నహివేవేన వేరాణి
సమ్మంతి ధకు దాచనమ్
అవెవేనచ సమ్మంతి
ఏసధమ్మో సనన్తనో'
—ధమ్మపద, 1 5

"ధంమే సాధూ కియం చు ధంమే తి అపాసినవే బహు
కయానే దయా దానే సచే సోచయే."
(ధర్మః సాధుః కియాంస్తు దర్మ ఇతి అపాస్రవో
బహుకల్యాణం దయా దానం సత్యం శౌచమ్.)
—అశోక ధర్మశాసనం - రెండోస్తంభ శాసనం.

"అహింసా పరమోధర్మః"

భారతీయ సనాతన ధర్మప్రతీకలు అశోక ధర్మశాసనాలు. అశోకుడు వీటిని "ధర్మలిపులు" "ధర్మశాశ్వవాలు" అని పేర్కొన్నాడు. అఖండ భారతాన్నంతా ఆక్రమించి ఉన్న తన సామ్రాజ్యప్రజల నుద్దేశించి ఈ శాసనాలలో అశోకుడు పొందుపరచిన ధర్మాన్ని పండితులు "అశోకధర్మ" మని పిలిచారు. ఈ అశోకధర్మం, పైన కనపరచిన సనాతనధర్మ నిర్వచనాలను బట్టి, భారతీయ సనాతనధర్మాని కంటే వేరయినది కాదు.

## అర్జున విషాదయోగం - అశోక విషాదయోగం

ధర్మ క్షేత్రమయిన కురుక్షేత్రంలో అర్జున విషాదయోగం వలె, కళింగ యుద్ధక్షేత్రంలో అశోక విషాదయోగం ఏర్పడింది హింసా విముఖమై, కృపయావిష్టమైన హృదయంతో, తీవ్రమైన అనుతాపానికి లోనైన ఒకానొక మానసికస్థితి నుంచి బయటపడటానికి నరునకు, నారాయణుని బోధ ఉపకరించింది; పలితంగా భగవద్గీత, భారతీయులకు వారసత్వంగా నిలచిపోయింది అట్టి మానసికస్థితి నుంచే బయటపడటానికి అశోకునకు బుద్ధవచనం ఉపకరించింది; ఫలితంగా అశోకధర్మం భారతీయులకు వారసత్వంగా నిలచిపోయింది. కృష్ణుడు, బుద్ధుడు, ఇద్దరూ కామ్యకర్మలను నిరసించినవారే. కృష్ణునిబోధ వల్ల అర్జునుడు, బుద్ధవచనం వల్ల అశోకుడు సమదర్శులు అయినారు ఈ సమదర్శిత్వమే అర్జునుణ్ణి యుద్ధోన్ముఖునిగా, అశోకుని యుద్ధవిముఖునిగా చేసింది.

తాను కురుక్షేత్ర యుద్ధ రూపంలో చేయబోయే హింసను తలచి అర్జునుడు,

'నకాంక్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖాని చ
.కిం నో రాజ్యేన గోవింద కిం భోగై ర్జీ వితేనవా?
యేషామర్థే కాంక్షితం నో రాజ్యం భోగం స్సుఖాని చ,
త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనాని చ.

ఆచార్యాః పితరః పుత్రా స్తథైవ చ పితామహాః,
మాతులాశ్శ్వశురాః పౌత్రాః శ్యాలాస్సంబంధిన స్తథా,
ఏతాన్న హన్తుమిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూధన,
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిన్ను మహీకృతే.

(భగవద్గీత, అర్జునవిషాదయోగం, శ్లో 32-35లు)

ఇత్యాదిగా శోకసంవిగ్నమానసుడై, తనయుద్ధ విముఖత్వాన్ని
యది మామప్రతీకారమశస్త్రం శస్త్రపాణయః,
దార్తరాష్ట్రా రణే హన్యుస్త న్మే క్షేమతరం భవేత్.
అని కృష్ణునికి తెలియపరిచాడు.

(భగవద్గీత, అర్జున విషాదయోగం, శ్లో. 46)

గురూ నహత్వా హి మహానుభావాన్,
శ్రేయో భోక్తుం భైక్ష మపీహ లోకే,
హత్వాఽర్థకామాంస్తు గురూ నిహైవ
భుంజీయ బోగాన్ రుధిరప్రదిగ్ధాన్.

(సాఙ్ఖ్యయోగం, శ్లో. 5)

అని, మహాత్ములైన పెద్దలను, గురువులను వధించటంకంటె బిక్షాటన చేసి జీవించటం మేలని తలచాడు.

ఇక, అశోకుడు, తాను కళింగయుద్ధ రూపంలో కావించిన అపార హింకాండను తలచి అంటున్నాడు . "దేవతాప్రియుఁడయిన ప్రియదర్శి రాజు పట్టాభిషిక్తుఁడయిన ఎనిమిదో ఏట కళింగరాజ్యం ఆతనిచే జయింప బడింది. లక్షా యాభైవేలజనులు ఆరాజ్యంనుంచి పంపివేయ బడినారు. లక్షమంది అక్కడ చంపివేయ బడినారు అక్కడ అంత కంటె ఎన్నోరెట్లుమంది చనిపోయారు తర్వాత కళింగరాజ్యం స్వాదీనమై వున్న ఇప్పుడు దేవానాంప్రియుఁడు తీవ్రంగా ధర్మపాలనాన్ని ధర్మకర్మలను ధర్మానుశాసనాన్ని చేస్తున్నాడు కళింగులను జయించిన దేవానాం

ప్రియునికి ఇట్టి అనుతాపం కలిగింది. జయింపబడని ఒకరాజ్యం జయింపబడినప్పుడు అందు జనులవధ, మరణం, ఇతర దేశాలకు పంపబడుట జరుగుచున్నవనటం, దేవానాంప్రియునికి (అశోకునకు) బాధాకరంగాను, శోచనీయంగాను తోస్తున్నది. కాని, ఈ కిందివి దేవానాంప్రియునికి (అశోకునకు) మరింత శోచనీయాలు. అక్కడ నివసించేవారిలో పెద్దలశుశ్రూష, మాతాపితృశుశ్రూష, గురుశుశ్రూష, స్నేహితులు, పరిచితులు, సహచరులు. బంధువులు, దాసులు, భృత్యులు, అయినవారియెడల ప్రతిపత్తి, ధృఢభక్తి కలిగిఉండే బ్రాహ్మణులు, శ్రమణులు, ఇతర శాఖలవారు, గృహస్థులైనవారు ఉంటారు. అట్టివారికి బాధ, వధ, తమ తమ ప్రియులైనవారికి పరదేశ గమనం సంభవిస్తుంది. తమకు అత్యంతప్రియులయిన స్నేహితులు, పరిచితులు, సహచరులు, బంధువులు అయినవారికి బాధ కలుగుతున్నప్పుడు, తమస్థితి బాగుండినా, వారిబాధ తమకూ బాధకరమే అవుతుంది. ఈ బాధ అందరిచేత పంచుకోబడుతుంది. ఇది దేవానాంప్రియునికి శోచనీయంగా ఉంది యవనులలోతప్ప, తక్కిన అన్ని దేశాలలోనూ బ్రాహ్మణులు, శ్రమణులు ఉన్నారు. ఏదో ఒకశాఖకు చెందని మనుష్యులు లేని దేశమే లేదు అందుచేత కలింగరాజ్యాన్ని జయించినప్పుడు ఆ దేశజనులలో నూరోవంతు మంది కాని, వెయ్యోవంతు మంది కాని వధింపబడో, మరణంపొందో ఉండినారని తలచుకొన్నప్పుడు దేవానాంప్రియునికి శోకం కలుగుతున్నది.” (శిలాశాసనం 13, తెలుగు అనువాదం)* ఇంకా, అశోకుడు తన పుత్ర, పౌత్రులను

* ప్రాకృత మూలానికి చూడు కింద, 13వ శిలాశాసనం, పు 30, 'అవిజితంహి...... అజగులుమతే వా దేవానంపియసా', సంస్కృత ఛ్ఛాయకు, పు. 33, “అవిజితంహి ...... అద్య గురుమత ఏవ దేవానాంప్రియస్య. (యోపి చ అపకరోతి క్షన్తవ్య ఏవమతో దేవానాంప్రియస్య).”

ఉద్దేశించి ఇలా అంటాడు: "ఇంతకుముందు కలిగిన జయముచాలును. కొత్త దేశాలను జయించ నవసరంలేదు. తమకు కొత్తజయం పొందవలె ననే కోరిక కలిగినయెడల తాము దయ కలిగి చిన్నశిక్షలను మాత్రమే తాము అవలంబించవలెను. ధర్మవిజయమే నిజమయిన విజయమని తాముతలచవలెను" (శిలాశాసనం 13, తెలుగు అనువాదం)*

నారాయణుడు నరునకు అనుగ్రహించిన సమదర్శిత్వం అధిభౌతికమై, దేశకాలాద్యనవచ్ఛిన్నమైనది, అశోకుడు సుగతుని నుంచి గ్రహించిన సమదర్శిత్వము భౌతికమై, దేశకాలావధి అయినది. అందువల్లనే కృష్ణార్జునులు పురాణ పురుషులు, తథాగతశోకులు చారిత్రిక పురుషులు. అందువల్లనే అర్జునుడు విన్నది యోగశాస్త్రం; అశోకుడు చెప్పింది ధర్మశ్రావణం.

## అశోక ధర్మసారం •

శిలాక్షరరూపమై, శాసనస్థమైన 'అశోకధర్మా'న్ని విపులంగా తరచి దానిలోని సారభూతమయిన విషయాన్ని గ్రహించినప్పుడు, అశోకధర్మం నైతికసూత్రాచరణతో కూడిందని తేలుతుంది. ఈ సూత్రాలను గురించి అశోకుడు 'ఈ ధర్మలిపులలో కొన్నికొన్ని భాగాలు మిక్కిలి మధురాలై ఉండటంచేత, జనులు వాటిప్రకారం నడచుకొంటారని మరల మరల వ్రాయబడినాయి' అనిచెప్పాడు (శిలాశాసనం. 14) అశోకధర్మానికి సారభూతమయిన సూత్రాలు ఇవి.

---

ప్రాకృతమూలానికి చూడు కింద, 13వ శిలాశాసనం, పు 32, "ఏతాయే చా అరాయే ఇయం.. . ధంమవిజయే",సంస్కృతచ్ఛాయకు, పు 34, "ఏతస్మై చార్థాయేయం... ..యో ధర్మవిజయః".

అశోక ధర్మంపై, కొంత విపులమయిన చర్చకు చూడు, డా|| సి. వి. రామచంద్రరావు, అశోకుడు (తెలుగు అకాడమీ, హైదరాబాదు, 1988) పు. 43-63 లు

1) తల్లిదండ్రులకు శుశ్రూష [శిలాశాసనం (శి. శా.) 3, 11; స్తంభశాసనం (స్తం.శా), 7, లఘు శిలాశాసనం. (ల శి. శా), 2]

2) గురుశుశ్రూష (స్తం. శా. 7)

3) పెద్దలయెడలా, మహాత్ములయెడలా భక్తి (శి. శా 9), (స్తం.శా.7)

4) బ్రాహ్మణుల, శ్రమణుల, దీనుల, వృద్ధుల, దాసుల, భృత్యుల యెడల అనురాగం (స్తం. శా. 7)

5) శ్రమణులకు, బ్రాహ్మణులకు, బంధువులకు, స్నేహితులకు, పరిచితులకు దానం (శి. శా 3, 9, 11)

6) దాసుల, భృత్యుల యెడల ప్రతిపత్తి (శి.శా. 9, 11)

7) ఇతరులను భయపెట్టకుండడం, చంపకుండడం (స్త శా, 13)

8) సర్వభూతాలకు బాధ కలిగించకుండడం, ప్రాణిహింస చేయకుండడం (శి.శా. 3, 11, 13, స్తం శా. 7)

9) నిగ్రహంతో, సమస్తజనుల యెడలా సమబుద్ధితో సంచరిస్తూ సంతోషంగా ఉండటం (శి.శా. 13)

10) అల్పవ్యయం, అల్పసంపద కలిగిఉండడం (శి శా. 3)

11) అపకారంచేసినవాడిని క్షమించడం (శి శా. 13)

సనాతన ధర్మ ప్రతిపాదితాలైన ఈ నైతిక ప్రవర్తనా సూత్రాలతో కూడిందే అశోక ధర్మం. దీనిని ఆచరించుటమే సాధువని (శి. శా. 3), ధర్మవ్రతమని (శి.శా 9, 11), ధర్మవిజయమని (శి శా.13) అశోకుడు పదేపదే చెప్పాడు. ధర్మం సాధువయిందని చెప్పి, ఆ ధర్మం ఎట్టిదనే ప్రశ్నకు సమాధానంగా, "ధర్మంలో పాపాలు ఉండవు. దయ, దానం, సత్యం, శౌచం, అనే చాలా కల్యాణగుణాలు అందులో చేరివున్నాయి" అని చెప్పాడు (స్తం. శా. 2). అశోకచక్రవర్తి తన రాజ్యపాలనాకాలంలో చివరగా, తన ఇరవైఏడో రాజ్యాభిషిక్త సంవత్సరం (క్రీ. పూ. 241

ప్రాంతం)లో వేయించిన శాసనమని తలచబడే ఏడో స్తంభశాసనంలో, "దయ, దానం, సత్యం, శౌచం, మోదం, సాధుత్వం, అనేవాటితో కూడిన ధర్మాన్ని ఆచరించటమే ధర్మాపదానమని, అదే ధర్మప్రతిపత్తి" అని చెప్పాడు తాను ప్రబోధించిన ధర్మాన్ని అనుసరించటానికి, శీలం, దానం, సంయమం, భావశుద్ధి,కృతజ్ఞత, భయరాహిత్యం, ధర్మకామత, శుశ్రూష, పాపభయం, పుణ్యాపాపవిచక్షణ, ఆత్మవిశ్లేషణ, మొదలుగా అనేకగుణాలు, అర్హతలు అవసరమని, అందువల్లే తన ధర్మాన్ని అనుసరించటం దుష్కరమని అశోకుడు పదేపదే చెప్పాడు. (శి శా. 4,7,10, 13, స్తం. శా. 1)

## సమాజశ్రేయస్సు - వ్యక్తిశ్రేయస్సు

భగవద్గీతలో వ్యక్తిఔన్నత్యం ద్వారా సమాజశ్రేయస్సు, లోక సంగ్రహం సాధించే మార్గం చెప్పబడింది అశోకధర్మం సమాజ సమష్టి ప్రవర్తన ద్వారా వ్యక్తిశ్రేయస్సు పొందే మార్గాన్ని తెలిపింది. ఆధునిక యుగంలో, నేటికాలంలో, సంఘంలోని వ్యక్తుల సమష్టి ప్రవర్తన మీద వ్యక్తిశ్రేయస్సు పూర్తిగా ఆధారపడివుంది. ఈ సమష్టిప్రవర్తన తప్పు దారులు పట్టటంయొక్క ఫలితమే నేడు మనం ప్రతిచోటా చూచే జాతి, ప్రాంత, కుల, మత, స్పర్ధలు, వైషమ్యాలు, కలహాలు. అశోకునికాలంలో వివిధ మతధర్మాల మధ్య స్పర్ధావైషమ్యాలు ఉండి, సమష్టిలో సత్ప్రవర్తన, సహనశీలత లోపించి సంఘశ్రేయస్సుకు, రాజ్యశాంతికి భంగకరమయిన పరిస్థితులు ఏర్పడినాయి. ఈ పరిణామాలను దృష్టిలో ఉంచుకొని, నాటికీ, నేటికీ, సంఘంలో మతపరమైన స్పర్ధావైషమ్యాలు సమసింపచేయటానికి, మతసామరస్యాన్ని పెంపొందింప చేయటానికి, సారభూతమైన నాలుగుసూత్రాలను అశోకుడు తన పంద్రెండో శిలా శాసనంలో ప్రతిపాదించాడు. సులభంగా జ్ఞాపకం ఉంచుకోవటానికి వీలుగా, శాసనంలోని పదాలనే కొంతగుర్తులుగా వాడి, వాటిని ఈ క్రింది విధంగా చెప్పవచ్చు.

1. మూల : అన్ని మతశాఖలవారి మూలధర్మాలను పెంపొందించటం
2. వచోగుప్తి : అసందర్భంగా, తన మతధర్మాన్ని పొగడకుండా ఉండటం, ఇతర ధర్మాలను తెగడకుండా ఉండటం.
3. సమవాయ తన శాఖవారు, అన్య శాఖలవారు ఒకరి ధర్మాన్ని మరొకరు వింటూ, ఒకరినొకరు ఉపచరించుకొంటూ పొత్తుగా ఉండటం.
4 బహుశ్రుత : అన్ని మతశాఖల ధర్మాలను గూర్చి వినటం, తెలుసుకోవటం.

ఈ అశోకధర్మం భారతీయ సనాతన ధర్మాన్ని అనుసరించింది, దానికంటె భిన్నమయిందికాదు. దీనిని అశోకుడు రెండో లఘు శిలా శాసనంలో 'పొరాణా పకితీ (పురాణీ ప్రకృతిః)', పురాణ ధర్మం అని పేర్కొన్నాడు అశోకుడు బౌద్ధాన్ని స్వీకరించటంచేత, ఈ ధర్మం బౌద్ధ ధర్మాన్ని అనుసరించిందని భావించినా, అశోకుని కాలానికి బౌద్ధధర్మం ప్రత్యేక మతదర్మంగా రూపొందలేదు. నాటికి అది వైదికధర్మంలో అతిగా చోటుచేసుకొని వెర్రితలలు వేసిన యజ్ఞయాగాది కామ్యకర్మలను, వర్ణవిబేదం వల్ల సంఘంలో కొన్ని వర్గాలవారు పెంచుకొన్న ఆధిక్యతాహంకారాన్ని నిరసించిన నిరసనోద్యమం మాత్రమే. దానిని బుద్ధప్రేరితమైన, వైదికమత సంస్కరణోద్యమంగానే పేర్కొనవలె.

## ఇహసుఖం - పరసుఖం

భారతీయ సంప్రదాయం ధర్మార్ధకామమోక్షాలను చతుర్విధ పురుషార్థాలుగా, అంటే మానవుడు తన జీవితకాలంలో సాధించవలసిన ప్రయోజనాలుగా పేర్కొనింది. అశోకుడు ధర్మానుసరణవల్ల అర్థ కామాలతో కూడిన ఇహసుఖం అబ్బుతుందని చెప్పాడు, కాని, అంత కన్నా గొప్పదైన పరసుఖం దొరకుతుందని గట్టిగా చెప్పాడు. సర్వజనుల ఇహపరలోక సుఖప్రాప్తికై, రాజుగా ప్రజలయెడల తనకుగల బాధ్యతా

రుణాన్ని తీర్చుకోవటమే తన ధర్మమని అశోకుడు ఉద్ఘాటించాడు. "సమస్త జనుల సౌఖ్యం అభివృద్ధి చేయటమే నా ధర్మమని నేను తలుస్తున్నాను ఆ సౌఖ్యానికి, నేను పడే శ్రమ, కార్యనిర్వహణ మూలంగా ఉన్నాయి ఎందువల్లనగా, జనుల సౌఖ్యం అబివృద్ధి చేయటానికంటే ముఖ్యమయిన ధర్మం మరొకటిలేదు. జీవలోకమంతా ఇహ లొకంలో సౌఖ్యంచెంది, అటుతర్వాత స్వర్గాన్నిపొందటానికై నేను వారికి అప్పుపడివున్న రుణాన్ని తీర్చుకొనటానికే నా ప్రయత్నాలన్నీ వినియోగ పడుతున్నాయి". (శిలాశాసనం 6).

అశోకుడురాజర్షి. నిష్కామకర్మచేత చిత్తశుద్ధినిపొంది లోక సంగ్రహమైన ధర్మాన్ని ప్రవర్తింపచేసినవాడు తాను అహింసను పరమ ధర్మంగా అవలంబించి తన ప్రజలలో అహింసాధర్మవ్యాప్తికై పాటుపడి కృతకృత్యుడైన రాజర్షిశ్రేష్ఠుడు అశోకుడు. "నేను చేసిన సాధుకార్యాలను లోకం అనుకరించి తానూ అవలంబిస్తున్నది" అని ఎంతో ఆత్మ ప్రత్యయంతో తన ధర్మప్రచారసాఫల్యాన్ని గూర్చి చెప్పుకొన్నాడు. (స్తంభశాసనం. 7).

అఖండ భారతదేశాన్ని పాలించిన చక్రవర్తులలో అతివిశిష్టమైన వ్యక్తిత్వం కలవాడు అశోకుడు బహుశా, ప్రపంచచరిత్రలో సామర్థ్యం, సాధనసంపత్తి ఉండికూడా యుద్ధవిజయాలను కాంక్షించని పాలకుడు అశోకుడు ఒక్కడే కనపడతాడు. అహింస ప్రాతిపదికగా రాజనీతిని రూపొందించిన రాజు అశోకుడు తప్ప మరొక్కడు కానరాడు.

'యద్యదా చరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః,
స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే'

అనే సూక్తికి అదర్శమే అశోకుడు.

--(౦)--

# అశోక ధర్మశాసనాలు

## మొదటి శిలాశాసనం

( కాల్సీశిల )

### ప్రాకృత మూలం :

౧ (1) ఇయం ధంమలిపి దెవానం పియేన పియదసినా లేఖితా
(2) హిదా నో కిచి జివే ఆలభితు పజోహితవియే

౨ (3) నొ పి చా సమాజే కటవియే (4) బహుకా హి దోసా
సమాజసా దేవానం పియే పియదసి లాజా దఖతి
(5) అథి పి చా ఏకతియా సమాజా సాధుమతా దేవా
నాం పియసా పియదసిసా లాజినే

౩ (6) పులే మహానససి దేవానం పియసా పియదసిసా లాజినే
అనుదివసం బహుని సాతసహసాని ఆలంభియిసు
సుపరాయే (7) సే ఇదాని యదా ఇయం ధంమలిపి
లేఖితా తదా తింని యేవా పానాని ఆలభియంతి

౪. దువే మజూలా ఏకే మిగే సే పి చూ మిగే నో ధువే
(8) ఏతాని పి చు తని పానాని నో ఆలాభియిసంతి

### సంస్కృతం :

(1) ఇయం ధర్మలిపిర్దేవానాం ప్రియేణ ప్రియదర్శినా లేఖితా. (2) ఇహ న కశ్చిజ్జీవ ఆలభ్య ప్రహోతవ్యః. (3) నాపి చ సమాజః కర్తవ్యః (4) బహుకాన్ హి దోషాన్ సమాజస్య దేవానాం ప్రియః ప్రియ

ఢర్శీ రాజా పశ్యతి (5) సన్త్యపి త్వైకే సమాజాః సాధుమతా దేవానా ప్రియస్య ప్రియదర్శినో రాజ్ఞః. (6) పురా మహానసే దేవానా ప్రియస్య ప్రియదర్శినో రాజ్ఞోऽనుదివసం బహూని ప్రాణసహ్ర ణ్యాలప్స్యత సూపార్థాయ. [7] తదిదానీం యదా ఇయం ధర్మలిపి ఖితా తదా త్రయ ఏవ ప్రాణా ఆలభ్యన్తే, ద్వౌ మయూరౌ ఏకో మృగః సోऽపి చ మృగో న ధ్రువః. [8] ఏతే పి చ త్రయః ప్రాణా నాలప్స్యన్తే

తెలుగు :

## అహింస

[1] ఈ ధర్మశాసనం దేవతలకు ప్రియుడయిన ప్రియదర్శి చేత రాయబడింది. [2] ఇక్కడ (అనగా పాటలీపుత్రంలోగాని, లేక సామ్రాజ్యంలో అంతటాగాని) జీవజంతువులను చంపకూడదు, బలి ఇవ్వకూడదు. [3] సమాజా [ఉత్సవా] ల కోసం జనులు ఒక చోట గుంపుగా చేరకూడదు (4) అట్లు చేరటంవల్ల చాలా దోషాలు దెవతా ప్రియుడయిన ప్రియదర్శికి కనబడుచున్నవి [5] రాజును దేవతాప్రియుడును అయిన ప్రియదర్శి సాధుసమ్మతాలని తలచే ఉత్స వాలు కొన్ని ఉన్నాయి [6] పూర్వకాలంలో, రాజును, దేవతాప్రియుడును అయిన ప్రియదర్శి వంట ఇంటిలో వందలు, వేలు జీవ జంతువులు కూరకోసం అనుదినం చంపబడేవి. [7] కాని, ఈ ధర్మలిపి లిఖించ బడిన కాలంలో దినానికి రెండు నెమళ్లు, ఒక లేడి, ఇట్లా మూడు ప్రాణులు మాత్రమే చంపబడుతున్నాయి. ఆ లేడి కూడా నిత్యం చంప బడటంలేదు. [8] ఇకముందు, ఈ మూడు ప్రాణులను కూడా చంప కూడదు.

# రెండో శిలాశాసనం

[ కాల్సీశిల ]

## ప్రాకృత మూలం:

౪. [1] సవతా విజితసి దేవానం పియసా పియదసిసా లాజినే యేచ, అంతా అథా చోడా పండియా సాతియపుతో కేలలపుతో తంబపంని.

౫. అంతియోగే నామ యోనలాజా యే చా అంనే తసా అంతి యోగసా సామంతా లాజానో సవతా దేవానం పియసా పియదసిసా లాజినే దువే చికిసకా కటా మను సచికిసా చా పసుచికిసా [2] ఓసఢీని మనుసోపగాని చా పసోపగాని చా అతతా నధి

౬. సవతా హాలాపితా చా లోపాపితా చా [3] ఏవమేవా ములాని చ ఫలాని చా అతతా నథిసవతా హలాపితా చా లోపాపి చాతా [4] మగేసు లుఖాని లోపితాని ఉదుపానాని చా ఖానాపితాని పటీభోగాయే పసుమునిసానం.

## సంస్కృతం:

[1] సర్వత్ర విజితే దెవానాం ప్రియస్య ప్రియదర్శినో రాజ్ఞో యే చాన్తా యథా చొడాః పాణ్డ్యాః సత్యపుత్రః కేరలపుత్రస్తామ్రపర్ణీ అన్తియోకో నామ యవనరాజో యే చాన్యే తస్యాన్తియోకస్య సామన్తా రాజానః సర్వత్ర దెవానాం ప్రియస్య ప్రియదర్శినో రాజ్ఞో ద్వే చికిత్సే కృతే మనుష్యచికిత్సా చ పశుచికిత్సా చ (2) ఔషధాని మనుష్యో

పగాని చ పశూపగాని చ యత్ర యత్రా న సన్తి సర్వత్ర హారితాని చ రోపితాని చ (3) ఏవమేవ మూలాని చ ఫలాని చ యత్ర యత్రన సన్తి సర్వత్ర హారితాని చ రోపితాని చ (4) మార్గేషు వృక్షా రోపితా నాని చ ఖానితాని ప్రతిభోగాయ పశుమనుష్యాణామ్.

## తెలుగు :

### చికిత్స

1) రాజును, దేవతలకు ప్రియుడును అయిన ప్రియదర్శి రాజ్యంలో ఎల్లెడలా, అతని ప్రాంత రాజులయిన చోడ, పాండ్య, సత్య పుత్ర, కేరళ పుత్ర, తామ్రపర్ణి రాజ్యాలలో, యవనరాజైన అంతియోకుని రాజ్యంలో, ఇట్లే ఆ అంతియోకుని సామంత రాజుల రాజ్యాలలో, రాజ యిన దేవానాం ప్రియ ప్రియదర్శిచేత రెండు విధాల వారయిన చికిత్స కులు నియమించబడినారు. మనుష్య చికిత్స, పశుచికిత్స ఏర్పాటు చేయబడినాయి (2) మనుష్యులకు ఉపయోగించేవి, పశువులకు ఉప యోగించేవి అయిన ఓషధులు ఎక్కడెక్కడ లేవో అక్కడ అంతా అవి తీసుకొని రాబడి నాటింపబడినాయి (3) ఇట్లే వేళ్లు, పండ్లు ఎక్కడె క్కడ లేవో అక్కడక్కడ అవి తీసుకొనిరాబడి నాటింపబడినాయి. (4) పశువులకు, మనుష్యులకు ఉపయోగించే నిమిత్తం మార్గాలలో చెట్లు నాటబడినాయి. బావులు త్రవ్వబడినాయి.

# మూడో శిలాశాసనం

( కాల్సీశిల )

## ప్రాకృత మూలం :

౬. (1) దేవానం పియే పియదసి లాజా హేవం అహా

౭. (2) దువాడసవసాభిసితేన మే ఇయం అనపయితే

(3) సవతా విజితాసి మమ యుతా లజూకే పాదేసికే పం చసు వసేసు అనుసంయాసం నిఖమంతు ఏతాయే వా అఠాయే ఇమాయ ధంమనుసదియా యధా అంనాయే పి కింమాయే (4) సాధు

౮ మాతాపితుసు సుసుసా మితసంధుతనాతిక్యానం చా బంభన సమనానం చా సాధుదానే పానాసం, అనాలంబే, సాధు అప వియాతా అపభండతా సాధు (5) పలిసాపి చ యుతాని గననసి అనపయిసంతి హేతుపతా చా వియంజనతే చా.

## సంస్కృతం :

దేవానం ప్రియః ప్రియదర్శీ రాజా ఏవమాహ (2) ద్వాదశ వర్షాభిషిక్తేన మయా ఇద మాజ్ఞప్తమ్ (3) సర్వత్ర విజితే మమ యుక్తా రజ్జుకాః ప్రాదేశికాశ్చ పఞ్చసు పఞ్చసువర్షేషు అనుసంయానం నిష్క్రా మన్తు ఏతస్మై అర్థాయ అస్మై ధర్మానుశిష్ట్యై యధా అన్యస్మా అపి కర్మణే (4) సాధుః మాతాపిత్రోః శుశ్రూషా మిత్ర సంస్తుతజ్ఞాతీనాం చ బ్రాహ్మణశ్రమణానాం చ సాధు దానం ప్రాణానామనాలంభః సాధుః

అల్పవ్యయతా అల్పభాణ్డతా సాధుః (5) పరిషదోzపి చ యుక్తాన్ గణనే, ఆజ్ఞాపయిష్యన్తి హేతుతశ్చ వ్యఞ్జనతశ్చ.

**తెలుగు :**

## అనుసంయానం

(1) రాజయిన దేవానాం ప్రియ ప్రియదర్శి ఇట్లా చెప్పుచున్నాడు (2) నా రాజ్యాభిషేకమయిన పన్నెండో సంవత్సరంలో ఇది ఆజ్ఞాపించబడింది. (3) నా రాజ్యంలో, ఎల్లెడలా, నాయొక్క [ఉద్యోగులగు] యుక్తులు. లజూకులు. ప్రాదేశికులు అనేవారు [తమ తమ మండలాలలో అంతటా] ఐదేండ్ల కొకసారి సంపూర్ణంగా ఈ కింది ధర్మానుశిష్టి కోసమూ, తక్కిన రాచకార్యాల కొరకూ, అనుసంయానము [యాత్ర] చేయవలెను. [4] తల్లితండ్రుల శుశ్రూష సాధువు. మిత్రులు, పరిచయస్తులు. బంధువులు, బ్రాహ్మణులు, శ్రమణులు- వీరికి దానం చేయటం సాధువు ప్రాణిహింస చేయకుండటం సాధువు. అల్పవ్యయం, అల్ప సంపద కలిగి వుండటం సాధువు [5] పరిషత్తులు తగిన కారణాలను చేర్చుతూ, అక్షరమైనా తప్పకుండా ఈ ధర్మాలను గణించవలసిందిగా యుక్తులను (ఉద్యోగులను) ఆజ్ఞాపించవలెను

## నాల్గో శిలాశాసనం

[ కాల్సీశిల ]

**ప్రాకృత మూలం:**

౮. [1] అతికంతం అంతలం బహుని వససతాని వఢితే వా పానాలంభే విహిసా చా భుతానం నాతినా అసంపటు

పతి సమన బంభనానం అసంపటిపతి [2] సే అజా
దేవానం పియసా పియదసినే లాజినే ధంమచలనేనా
బేలిఘోసే అహో ధంమఘోసే విమనదసనా

౧౦. హథిని అగ్గికంధాని అంనాని చా దివ్యాని లుపాని దస
యిత్తు జినస [3] అదిసా బహుహి వససతేజ నా హుత
పులు వే తాదిసే అజావధితే దేవానం పియసా పియ
దసినే లాజినే ధంమనుసదియే అనాలంబే పానానం
అవిహిసా భూతానం నాతినం

౧౧. సంపటిపతి బంధనసమనానం సంపటిపతి మాతా
పితిసు సుసుసా [4] ఏసే చా అంనే చా బహువిదే
ధంమచలనే వధితే [5] వధియిసతి చేవా దేవానం
పియే పియదసి లాజ ఇమం ధంమచలనం
[6] పుతా చ కం నతాలే చా పనాతిక్యా చా దేవానం
పియసా పియదసినే లాజినే

౧౨ పవడయిసంతి చేవ ధంమచలనం ఇమం ఆవకపం
ధంమసి సీలసి చా చిఠితు ధంమం అనుసాసిసంతి
[7] ఏసే హి సేఠే కంమం అం ధంమానుసాసనం
[8] ధంమచలనే చా నో హోతి అసిలసా [9] సే
ఇమసా అఠసా వధి అహీని చా సాధు [10] ఏతాయే
అథాయే ఇయం లిఖితే.

౧౩. ఇమసా అఠసా వధి యుజంతు హీని చ మా అలోచ
యిసు [11] దువాడసవసాభిసితేన దేవానం పియేనా
పియదశినా లాజినా లిఖితా.

సంస్కృతం:

[1] అతి క్రాంతామన్తరం బహూని వర్షశతాని వర్ధిత ఏవ ప్రాణాలమ్భో విహింసా చ భూతానాం జ్ఞాతినామసంప్రతిపత్తిః శ్రమణబ్రాహ్మణానా మసంప్రతిపత్తిః [2] తదద్య దేవానాం ప్రియస్య ప్రియదర్శినో రాజ్ఞో ధర్మచరణేన బేరీఘోషోzథో ధర్మఘోషో విమానదర్శనాని, హస్తినోzగ్ని స్కన్ధాఅన్యాని చ దివ్యాని రూపాణి దర్శయితుం జనస్య. (3) యాదృశం బహుభిర్వర్షశతైర్న భూతపూర్వం తాదృశమద్య వర్ధితో దేవానాం ప్రియస్య ప్రియదర్శినో రాజ్ఞో ధర్మానుశిష్ట్యా అనాలంభః ప్రాణానామవిహింసా భూతానాం జ్ఞాతిషు సంప్రతిప్రత్తి ర్బ్రాహ్మణశ్రమణానాం నంప్రతి పత్తిర్మాతాపిత్రోః శుశ్రూషా. (4) ఏతచ్చాన్యచ్చ బహువిధం ధర్మచరణం వర్ధితమ్, (5) వర్ధయిష్యన్తిచైవ దేవానాం ప్రియః ప్రియదర్శీ రాజేదం ధర్మచరణమ్. (6) పుత్రాశ్చ నప్తారశ్చ ప్రనప్తారశ్చ దేవానాం ప్రియస్య ప్రియదర్శినో రాజ్ఞః ప్రవర్ధయిష్యన్తి చైవ ధర్మచరణమిదం యావత్కల్పం, ధర్మే శీలె చ తిష్ఠన్తో ధర్మమనుశాసిష్యన్తి. (7) ఎతద్ధి శ్రేష్ఠం కర్మ యద్ధర్మానుశాసనం, (8) ధర్మచరణమపి న భవత్యశీలస్య. (9) త దస్యార్థస్య వృద్ధిరహానిశ్చ సాధుః, (10) ఏతస్మై అర్థాయేదం లిఖితమ్ అస్యార్థస్య వృద్ధిం యుఙ్జన్తు హానిం చ మా ఆలోచయన్తు, (11) ద్వాదశవర్షాభిషిక్తేన దేవానాం ప్రియేణ ప్రియదర్శినా రాజ్ఞా లేఖితమ్.

తెలుగు :

## ధర్మఘోష

(1) పూర్వకాలంలో అనేక సంవత్సరాల వరకు ప్రాణులను చంపటం, భూతాలను హింసించటం, జ్ఞాతుల యెడల అమర్యాద,

శ్రమణుల యెడల, బ్రాహ్మణుల యెడల తిరస్కారభావం వృద్ధిపొం దింపబడినాయి. (2) కాని, ఇప్పుడు, దేవానాంప్రియ ప్రియదర్శి ధర్మా చరణంవల్ల, విమానాలు చూపించటం, ఏనుగులు, అగ్నిస్కంధాలు. ఇతర దివ్య రూపాలు, వీటిని ప్రదర్శించటం, (ఆ సమయాలలో) ధర్మ ఘోష, భేరీ ఘోషమూలాన చేయబడటం జరుగుతున్నది. (3) ఇంతకు పూర్వం వందలకొలది సంవత్సరాలనుంచి జరుగనట్టి ప్రాణులను చంపకుండటం, భూతాలను హింసించకుండటం, జ్ఞాతులయెడ గౌర వం, శ్రమణులయెడ బ్రాహ్మణులయెడ మర్యాద, మాతాపితృ శుశ్రూష, ఇట్టిధర్మాను శాసనం దేవానాంప్రియ ప్రియదర్శిచేత ఇప్పుడు చేయబడుతున్నది. (4) ఇట్లా, ఇతర విధాలలో ధర్మాచరణం వృద్ధిచేయ బడింది. (5) ఇట్టి ధర్మాచరణాన్ని రాజైన దేవానాంప్రియ ప్రియదర్శి ఇకముందుకూడా పెంపొందిస్తాడు. (6) దేవానాం ప్రియ ప్రియదర్శి రాజుయొక్క పుత్రులు, పౌత్రులు, ప్రపౌత్రులు ఈ ధర్మాచరణాన్ని ఆ కల్పాంతం పెంపొందిస్తూ, ధర్మంలో శీలంలో నిలకడగా నిలచి ధర్మశాస నాన్ని అనుశాసిస్తుంటారు (7) ధర్మాను శాసనమే కదా శ్రేష్ఠమైన కర్మ! (8) శీలంలేని వాడికి ధర్మాచరణం సాధ్యంకాదు. (9) అందు వల్ల, ఈ అర్థాన్ని వృద్ధిచేయటం దానికి హాని కల్పించకుండటం సాధు మార్గం (10) ఈ ధర్మాచరణానికి వృద్ధికల్పిస్తారని, దానికి హాని కల్పిం చకుందురుగాక అని ఇది రాయబడింది. (11) రాజ్యాభిషిక్తకాలం పంన్రెండో సంవత్సరంలో రాజైన దేవానాంప్రియ ప్రియదర్శిచేత రాయించబడింది.

# ఐదో శిలాశాసనం

[ కాల్సీశిల ]

## ప్రాకృత మూలం:

౧౩, [1) దేవానం పియే పియదసి లాజా ఆహా [2] కయానె దుకలే [3] ఏ అది కలే కయానసా సే దుకలం కలేతి [4] సే మమయా బహు కయానే కటే [5] తా మమా పుతా చా నతాలే చా,

౧౪. పలం చా తే హి యే అపతియే మే అవకపం తథా అనువటిసంతి సే సుకటం కచంతి [6] ఏ చు హేతా దేసం పి హాపయిసతి సే దుకటం కచతి [7] పాపే హి నామా సుపదాలయే [8] సే అతికంతం అంతలం నో హుతపులువ ధంమమహామాతా నామా [9] తేడసవ సాభిసితేనా మమయా ధంమమహామాతా కటా [10] తే సవపాసండేసు వియాపటా

౧౫. ధంమాధిథానాయే చా ధంమవఢియా హిదసుఖాయే వా ధంమయుతసా యోనకంబోజగంధాలానం ఏవాపి అంనే అపలంతా [11] భటమయేసు బంభనిబేసు అనధేసు వుధేసు హిదసుఖాయే ధంమయుతాయే అపలి బోధాయే వియపటా తే [12] బంధనబధసా పటి విధానాయే అపలిబోధాయే మోఖాయే చా ఏయం అనుబధా పజావ తి వా.

౧౬. కటాభికాలే తి వా మహలకే తి వా వియాపటా తే [13] హిదా బాహిలేసు చా నగలేసు సవేసు ఓలోధ నెసు భాతినం చ నే భగినినా ఏవాపి అంనే నాతిక్యే సవతా వియాపటా [14] ఏ ఇయం ధంమనిసితే తి వా దానసుయుతే తి వా సవతా విజితసి మమా ధంమ యుతసి వియాపటా తే ధంమమహామతా [15] ఏతాయే అఠాయే.

౧౭. ఇయం ధంమలిపి లేఖితా చిలఠితిక్యా హోతు తథా చ మే పజా అనువతతు

సంస్కృతం:

(1) దేవానాం ప్రియః ప్రియదర్శి రాజా ఆహ (2) కల్యాణం దుష్కరం (3) యో యది కుర్యాత్ కల్యాణస్య స దుష్కరం కరోతి (4) తన్మయా బహు కల్యాణం కృతం (5) తన్మమ పుత్రాశ్చ పరం చ తాని హి యాన్యపత్యాని మే యావత్కల్పం యథానువర్తిష్యన్తే తత్సు కృతం కరిష్యన్తి (6) యస్త్వత్ర దేశమపి హాపయిష్యతి స దుష్కృతం కరిష్యతి (7) పాపం హి నామ సుప్రచారమ్ (8) తదతిక్రాన్త మన్తరం న భూత పూర్వా ధర్మమహామాత్రా నామ. (9) త్రయోదశ వర్షాభి షిక్తేన మయా ధర్మమహామాత్రాః కృతాః (10) తే సర్వ పాషణ్డేషు వ్యాపృతాః, ధర్మానుష్ఠానాయ చ ధర్మవృద్ధ్యై హితసుఖాయ చ ధర్మయుక్తస్య యవన కంభోజగన్ధరాణామ్ ఏ వమప్యన్యేऽపరాన్తా. (11) భృతమయేషు బ్రాహ్మణేభ్యేషు అనాథేషు వృద్ధేషు హితసుఖాయ ధర్మయుక్తస్య అపరిబాధాయ వ్యాపృతాః తే (12)బన్ధనవధస్య ప్రతివిధానాయ అపరిబాధాయ మోక్షాయ చ, ఏవమనువధం ప్రజావన్త ఇతి వా

కృతాధికారా ఇతివా మహాన్త ఇతి వా వ్యాపృతాస్తే. (13) ఇహ బాహ్యేషు చ నగరేషు సర్వేషు అవరోధనేషు భ్రాతౄణాం చాన్యే భగినీనా మేవమప్యన్యే జ్ఞాతిషు సర్వత్ర వ్యాపృతాః. (14) ఏవం ధర్మనిశ్రితా ఇతి వా దానసంయుక్తా ఇతి వా సర్వత్ర విజితే మమధర్మయుక్తా వ్యాపృతాస్తే ధర్మమహామాత్రాః (15) ఏతస్మై అర్థాయ ఇయం ధర్మలిపి ర్లేఖితా చిరస్థితికా భవతు తథా చ మే ప్రజా అనువర్తన్తామ్.

తెలుగు :

## ధర్మమహామాత్రులు

[1] దేవతాప్రియుడైన ప్రియదర్శిరాజు చెప్పుతున్నాడు. [2] కళ్యాణము ఆచరించుట కష్టము. [3] కళ్యాణారంభం చేసే వాడు దుష్కర కార్యాన్ని చేస్తున్నాడు. [4] ఇప్పుడు నావల్ల అనేక కల్యాణ కార్యాలు చేయబడినాయి. [5] అందువల్ల నా కొడుకులు, మనుమలు నా తర్వాత కల్పాంతం వరకు వచ్చే నా సంతతివారు ఇట్లే సంచరిస్తే వారు సుకృతం చేసిన వారవుతారు. [6] ఇందులో లేశమైనా చేయక విడిచేవాడు దుష్కృతం చేసిన వాడవుతాడు. [7] పాపమనేది శీఘ్రంగా వ్యాపిస్తుంది. [8] పూర్వకాలంలో మహామాత్రులనే ధర్మాధి కారులు లేకుండినారు [9] నా రాజ్యాభిషిక్త కాలం పదమూడో యేట ధర్మమహామాత్రులు ఏర్పాటుచేయబడినారు. [10] వారు అన్ని శాఖల వారిలో, ధర్మస్థాపనకోసం, ధర్మవృద్ధి కొరకు, ధర్మ నిరతులయిన వారి హితము కొరకు, సౌఖ్యం కొరకు, యవన, కంభోజ, గంధారదేశస్థులలో నారాజ్య పశ్చిమప్రాంతాల వారిలో కూడా పాటు పడుతున్నారు. [11] భృత్యులు, ప్రభువులు, బ్రాహ్మణులు, వైశ్యులు, అనాధులు, వృద్ధులు ఆయినవారి కొరకు, ధర్మనిరతులయినవారి హితసుఖాల

కొరకూ, పాటుపడుతూ, వారిని సంసార శృంఖలాల నుంచి విడిపించం టలో వ్యాతులై ఉన్నారు. [12] సంతాన వంతులై ఉండే ఖైదీలకు ధనమిచ్చి పోషించటం, పిచ్చి ఎత్తి ఉన్నవారి సంకెళ్లు తీయించ టం, వృద్ధులయి ఉన్నవారిని కారాగార విముక్తులను చేయటం అనే పనులలో ఉన్నారు. [13] ఇక్కడా, పరరాజ్యాల లోని నగరా లలో మా భ్రాతలు, అక్కచెల్లెండ్రు, ఇతర బంధువులు,-వీరి అంతః పురాలలో వీరు తమ ధర్మాదికారాన్ని కలిగి వున్నారు . [14] ఈ ధర్మ మహామాత్రులు నా రాజ్యంలో ఎవరు ధర్మనిరతులో, ఎవరు దాన నిర తులో తెలుసుకోవటానికి, ధర్మయుక్తులయిన వారితో కలసి తిరుగుతు న్నారు [15] అందువల్లనే, చిరస్థాయి కావాలని. దాని ప్రకారం నడచు కొంటారని, ఈ ధర్మశాసనం లిఖించబడింది.

## ఆరో శిలాశాసనం

( కాల్సీశిల )

### ప్రాకృత మూలం :

౧౭ (1) దేవానం పియే పియదసి లాజా హేవం అహా (2) అతి కంతం అంతలం నో హుతపులువే సవం కలం అఠ కంమే వా పటివేదనా వా (3) సే మమయా హేవం కటే (4) సవం కాలం అదమానసా మే.

౧౮. ఓలోధనసి గభాగాలసి వచసి వినితసి ఉయానసి సవతా పటివేదకా అఠం జనసా(పటి)వేదేతు మే (5) సవతా చా జనసా అఠంకచామిహకం (6) యం పి చా కిఛి ముఖతే అనపయామి హకం దాపకం వా సావకం వా యే వా పునా మహామతేహి

౧౯. అతియాయికే ఆలోపితే హోతి తాయేరాయే వివాదే నిఝతి వా సంతం ఫలిసాయే అనంతలియేనా పటి (వేదేత)వియే మే సవతా సవం కాలం(7)హేవం అనప యితే మమయా(8) నది హి మే దోసే ఉరానసా అరం సంతిలనాయే చ (9 కటవియముతే హి మే సవలోక హితే (10 తసా చా పునాఏసే ములే ఉరానే

౨౦. అరసంతిలనా చా (11) నధి హి కంమతలా సవలోక హితేనా (12) యం చ కిఛి పలకమామి హకం కితి భుతానం అననియం యేహం హిద చ కాని సుఖా యామి పలత చా స్వగం అలాధయితు (13) సే ఏతా యేరాయే ఇయం ధమలిపి లేఖితా చిలరితిక్యా హోతు తథా చ మే పుతదాలే పలకమాతు సవలోకహితాయే

౨౧. (14) దుకలే చు ఇయం అనతా అగేనా పలకమేనా

## సంస్కృతం :

[1] దేవానాం ప్రియః ప్రియదర్శీ రాజా ఏవ మాహ[2] అతిక్రాన్తమన్తరం న భూతపూర్వం సర్వం కాలమర్థకర్మ వా ప్రతివేదనా వా [3] తన్మయా ఏవం కృతం [4] సర్వకాలమ్ అదతో మె అవరోధనే గర్భాగారే వర్చసి వినీతే ఉద్యానే సర్వత్ర ప్రతివేదకా అర్థం జనస్య ప్రతివేదయన్తు [5] సర్వత్ర చ జనస్యార్థం కరిష్యామ్యహమ్ [6] యదపి చ కించిన్ముఖత ఆజ్ఞాపయామ్యహం దాపకం వా శ్రావకం వా యద్వా పునర్మహామాత్రైః ఆత్యయికే ఆజ్ఞాపితం భవతి తస్మై అర్థాయ వివాదే నిర్ధ్యాతౌ వా సత్యాం పరిషదా అనన్తర్యేణ ప్రతి (వేద) యితవ్యం మే సర్వత్ర సర్వకాలమ్ [7] ఏవమాజ్ఞాపితం మయా

[8] నాస్తి హి మే తోషో వా ఉత్థానాయ అర్ధసంతరణాయ చ,[9] కర్తవ్యం మతం హి మే సర్వలోకహితమ్ [10] తస్య పునరేతన్మూలముత్థానమ్ అర్ధసంతరణం చ [11] నాస్తి హి కర్మాన్తరం సర్వలోకహితేన [12] యత్కించిత్పరా క్రమేహం, కిమితి? భూతానామానృణ్యమేయామ్ ఇహ చ కాంశ్చింత్ సుఖయామి పరత్ర చ స్వర్గమారాధయితుమ్ [13] తదేతస్మా అర్థాయేయం ధర్మలిపిర్లేఖితా చిరస్థితికా భవతు, తథా చ మే పుత్రదారం పరాక్రమతాం సర్వలోక హితాయ,[14]దుష్కరం చేదమన్యత్రా గ్ర్యాత్ పరాక్రమాత్.

తెలుగు :

## ప్రతివేదకులు

(1) దేవతా ప్రియుడయిన ప్రియదర్శి రాజు ఇట్లా చెప్పుతున్నాడు (2) పూర్వకాలంలో, ఇంతకు పూర్వం ఎప్పుడూ ధర్మకార్యాలను చక్కబెట్టటం కానీ ఆ విషయంగా ప్రతివేదకులను పంపటం కాని ఆచారంలో లేదు (3) నేను ఇప్పుడట్లు చేస్తున్నాను (4) నేను భోజనం చేస్తు డినా, అంతఃపురంలో ఉన్నా, గర్భాగారంలో ఉన్నా, గోష్ఠంలో ఉన్నా, పల్లకిలో ఉన్నా, ఉద్యానవనంలో ఉన్నా, ఎక్కడ ఉన్నా, ఏ కాలంలో అయినా జనుల వృత్తాంతాన్ని ప్రతివేదకులు నాకు తెలుపుతుండవలెను. (5) అన్నిచోట్లా, నేను జనుల కార్యాలను చక్కబెట్టుతుంటాను (6) ఇదిగాక నేను చేసిన ఒక దానాన్ని గూర్చికాని, కేవల వాగ్రూపంగా నేను చేసిన ఆజ్ఞను గూర్చిగాని, మహామాత్రులపరంగా నేనొప్పచెప్పిన ఒక అవసర కార్యాన్ని గురించికాని, ఆ మహామాత్రుల పరిషత్తులలో ఎట్టి వివాదాలు వచ్చినా వారిలో ఎప్పరైనా దానికి సవరణ ప్రతిపాదించినా, ఆ సంగతి నే నేక్కడున్నా, ఏ వేళలోనైనా, నాకు తెలియచేస్తుండవలె, (7) ఇట్లు నా ఆజ్ఞ అయినది.

(8) నేను చేసే శ్రమలో కాని, కార్యనిర్వహణలోకాని నాకు తృప్తిలేదు. (9) సమస్త జనుల సౌఖ్యాన్ని అభివృద్ధిచేయటమే నా ధర్మమని తలస్తున్నాను. (10) ఆ సౌఖ్యానికి, నేను పడే శ్రమ, కార్య నిర్వహణ, మూలంగా ఉన్నాయి (11) ఎందువల్లనగా, జనుల సౌఖ్యం అభివృద్ధి చేయటాని కంటే ముఖ్యమయిన ధర్మం మరొకటి లేదు. (12) జీవ లోకమంతా ఇహలోకంలో సౌఖ్యంచెంది, అటుతర్వాత స్వర్గాన్ని పొంద టానికై నేను వారికి అప్పుపడివున్న ఋణాన్ని తీర్చుకొనటానికే నా ప్రయత్నాలన్నీ వినియోగపడుతున్నాయి (13) చిరస్థాయిగా ఉంటుందని, నా పుత్రులూ, నా భార్యలూ సర్వజన సౌఖ్యం కొరకు నా వలెనే ఉత్సాహం చూపుతారని ఈ ధర్మశాసనం లిఖించబడింది. (14) గొప్ప ఉత్సాహం లేకపోతే, ఇట్టి దుష్కర ధర్మం అవలంభించటం కష్టము.

## ఏడో శిలాశాసనం

[ కాల్సిశిల ]

### ప్రాకృత మూలం:

౨౧ [1] దేవానంపియే పియదసి లాజా సవతా ఇఛతి సవ పాసండ వసేవు[2]సవే హి తే సమయం భావసుధి చా ఇఛంతి [3] జనే చు ఉచావుచాఛంధే ఉచావుచలాగే [4] తే సవం ఏకదేసం పి కఛంతి [5] విపులే పి చు దానే అసా నధి

౨౨. సయమే భావసుధి కిటనాతా ధిఢభతితా చా నిచే బాడం.

సంస్కృతం :

(1) దేవానాం ప్రియః ప్రియదర్శీ రాజా సర్వత్రేచ్ఛతి సర్వే పాషణ్డా వసేయుః (2) సర్వే హి తే సంయమం భావశుద్ధిం చేచ్ఛన్తి (3) జనస్తూచ్చావచచ్ఛన్ద ఉచ్చావచరాగః (4) తే సర్వమేకదేశం వా కరిష్యన్తి (5) విపులమపి తు దానం యస్య నాస్తి సంయమో భావశుద్ధిః కృతజ్ఞతా ధృడభక్తితా చ అనీచా బాఢమ్.

తెలుగు :

## భావశుద్ధి

(1) దేవతా ప్రియుడయిన ప్రియదర్శి రాజు సమస్త శాఖల జనులూ తమ ఇచ్ఛ వచ్చిన చోట నివసింపపచ్చునని కోరుతున్నాడు. (2) వీరందరూ సంయమనాన్ని, భావశుద్ధిని కోరుతుంటారుకదా. (3) కాని జనులు, వేర్వేరు కోరికలు, రాగాలు కలిగివుంటారు (4) వారు తమ కర్మాలలో అన్నిటిని కాని, కొన్నింటిని మాత్రంకాని నిర్వర్తిస్తుంటారు (5) విపులమైన దానం, సంయమం. భావశుద్ధి, కృతజ్ఞత, ధృఢభక్తి లేనివారు తప్పక నీచులవుతారు.

# ఎనిమిదో శిలాశాసనం

( కాల్సీశిల )

## ప్రాకృత మూలం :

౨౨. [1] అతికంతం అంతలం దెవానంపియా విహాలయాతం నామ నిఖమిసు [2] హిదా మిగవియా అంనాని చా హేదిసానా అబిలామాని హుసు [3] దేవానంపియే పియదసి లాజా దసవసాభిసితే సంతం నిఖమిథా సంబోధి.

౨౩. [4] తేనతా ధంమయాతా [5] హేతా ఇయం హోతి సమనబంభనానం దసనే చా దానే చ వుఢానం దసనే చ హిలంనపటివిధానే చా జానపదసా జనసా దసనే ధంమనుసథి చా ధమపలిపుచా చా తతోపయా [6] ఏసే భుయే లాతి హోతి దేవానం పియసా పియదసిసా లాజినే భాగే అంనే.

## సంస్కృతం:

(1) అతిక్రాన్తమన్తరం దేవానాంప్రియో విహారయాత్రాం నామ నిరక్రమయన్,[2] ఇహ మృగవ్యా అన్యాని చ ఈదృశాని అభిరామాణి అభవన్ [3] దేవానాంప్రియః ప్రియదర్శీ రాజా దశవర్షాభిషిక్తః సన్ నిరక్రమీత్ సంబోధమ్ [4] తేనాత్ర ధర్మయాత్రా. [5] అత్రేదం భవతి శ్రమణానాం బ్రాహ్మణానాం చ దర్శనం చ దానం చ వృద్ధానాం దర్శనం చ హిరణ్యప్రతివిధానం చ జానపదస్య జనస్య దర్శనం ధర్మానుశిష్టిశ్చ ధర్మపరిపృచ్ఛా చ తతోపి యా [6] ఏషా భూయో రతిర్భవతి

దేవానాంప్రియస్య ప్రియదర్శినో రాజ్ఞః బాగ్యమన్యత్.

## తెలుగు :

# ధర్మయాత్ర

(1) పూర్వకాలంలో దెవానాం ప్రియులు విహార యాత్రకై బయలుదేరి పోతుండిరి. (2) అట్టి యాత్రలలో వేటలు, అట్టి ఇతర వినోదాలు జరుగుతుండెడివి (3) దేవతా ప్రియుడయిన ప్రియదర్శి రాజు పట్టాభిషిక్తుడైన పదొ ఏట సంబోధి నగరానికి పోయినాడు. (4) ఇక్కడ అతడు ధర్మయాత్ర చేసినాడు. (5) ఈ యాత్రలలో శ్రమణ బ్రాహ్మణులను దర్శించటం, వారికి దానాలు చేయటం, వృద్ధులను దర్శించి వారిని సువర్ణ దానాలచేత పోషించటం, దేశ జనులను చూచి వారికి ధర్మోపదేశం చేయటం, వారి ధర్మాభివృద్ధిని గూర్చి ప్రశ్నించటం, ఇట్టివే జరుగుతూ ఉండెను. (6) దేవానాం ప్రియుడగు ప్రియదర్శిరాజుయొక్క ద్వితీయ భాగ్యమే ఎక్కువ ప్రీతికరమయినది

# తొమ్మిదో శిలాశాసనం

[ కాల్సిశిల ]

## ప్రాకృత మూలం:

౨౪. [1] దేవానంపియే పియదసి లాజా ఆహా [2] జనే ఉచా
వుచంమంగలం కలేతి ఆబాధసి అవాహసి వివాహసి
పజోపదానే పవాససి ఏతాయే అంనాయే చా ఏదిసాయే

జనే బహు మగలం కలేతి [3] హేత చు అబక
జనియో బహు చా బహువిధం చా ఖుదా చా నిలదియా
చా మగలం కలంతి.

౨౫, [4] సే కటవి చేవ ఖో మంగలే [5] అపపతే చు ఖో
ఏసే [6] ఇయం చు ఖో మహాపలే యే ధంమమగలే
(7) హేతా ఇయం దాసభటకసి సమ్యాపటిపతి గులునా
అపచితి పానానం సయమే సమనబంభనానం దానే ఏసే
అంనే చా హేడిసే ధంమమగలే నామా [8] సే
వతవియే పితినా పి పుతేనా పి భాతినా పి సువామి
కేన పి సితసంధుతేనా ఆవ పటివేసియేనా పి

౨౬. ఇయం సాధు ఇయం కటవియే మగలే ఆవ తసా
అధసా నివుతియా ఇమం కచామితి [9] ఏ హి మగలే
ఇతలే సంసయిక్యే సే [10] సియా వ తం అఠం
నివటేయా సియా పునా నో [11] హిదలోకికే చేవ సే
[12] ఇయం పునా ధంమమగలే అకాలిక్యే
[13] హంచే పి తం అఠం నో నిటేతి హిద అఠం
పలత అనంతం పునా పవసతి [14] హంచే పున తం
అఠం నివతేతి హిదా తతో ఉభయేసం

౨౭ లదే హోతి హిద చా సే అఠే పలత చా అనంతం
పునా పవసతి తేనా ధంమమగలేనా

## సంస్కృతం:

(1) దేవానాం ప్రియః ప్రియదర్శీ రాజా ఆహ (2) జన
ఉచ్చావచం మఙ్గలం కరోతి, ఆబాధే ఆవాహే వివాహే ప్రజోత్పాదే ప్రవాసే

మాత్రులు)ను చేయుచున్నారు (7) ధర్మపరిపాలనం, ధర్మవిధానం, ధర్మమార్గంలో సుఖం కల్పించటం, ధర్మానుసారంగా వచోనిగ్రహం అనేవి వారి విధులై ఉన్నాయి.

## రెండో స్తంభశాసనం

### ప్రాకృతమూలం :

౧౦ (1) దెవానంపియే పియదసి లాజ
౧౧. హేవం ఆహా (2) ధంమే సాధూ కియం చు ధంమే తి (3) అపాసినవే బహు కయానే
౧౨ దయా దానె సచె సొచయే (4) చఖుదానే పి మే బహువిధే దింనే (5) దుపద-
౧౩ చతుపదెసు పఖివాలిచలేసు వివిధె మే అనుగహే కటె ఆ పాన-
౧౪ దాఖినాయే (6) అంనాని పి చ మే బహూని కయానాని కటాని (7) ఏతాయే మె
౧౫ అఠాయే ఇయం ధంమలిపి లిఖాపితా హేవం అనుపటిపజంతు చిలం-
౧౬. థితికా చ హోంతూ తి తి (8) యే చ హేవం సంపటిపజీసతి సె సుకటం కఛతి తి

### సంస్కృతం :

(1) దేవానాం ప్రియః ప్రియదర్శీ రాజైవమాహ (2) ధర్మః సాధుః కియాంస్తు ధర్మ ఇతి (3)అపాస్రవో బహుకల్యాణం దయా దానం సత్యం శౌచమ్ (4) చక్షుర్దానమపి మే బహువిధం దత్తం (5) ద్విపద-చతుష్పదేషు పక్షివారిచరేషు వివిధో మే అనుగ్రహః కృత ఆప్రాణ-

దక్షిణామ్ (6) అన్యాన్యపి చ మే బహూని కళ్యాణాని కృతాని (7) ఏతస్మా అర్థాయేయం ధర్మలిపిర్లేఖితా ఏవ మనుప్రతిపద్యన్తాం చిరస్థితికా చ భవత్వితి (8) యశ్చైవం సంప్రతిపత్స్యతే స సుకృతం కరిష్యతీతి.

తెలుగు :

## ధర్మ నిర్వచనం

(1) దేవతాప్రియుడయిన ప్రియదర్శిరాజు చెప్తున్నాడు. (2) ధర్మం సాధువయినది కాని ధర్మమంటే ఎట్టిది? (3) ధర్మంలో పాపాలు ఉండవు దయ, దానం, సత్యం, శౌచం అనే చాలా కళ్యాణ గుణాలు అందులో చేరిఉన్నాయి (4) నేను ధర్మచక్షుర్దానం అనేక విధాలుగా చేసిఉన్నాను (5) ద్విపాత్తులు, చతుష్పాత్తులు పక్షులు, జలచరాలు, అనేవాటిలో ప్రాణదక్షిణతో కూడా అనేక విధాలుగా నేను అనుగ్రహం చూపాను. (6) ఇవికాకుండా, అనేక కళ్యాణకరాలైన కార్యాలను నేను చేసిఉండినాను జనులు ధర్మాన్నిపాలిస్తారనీ, ఇది చిరస్థాయిగా ఉంటుందని, ఈ ధర్మలిపిని నేను లిఖింపచేశాను. (8) దీనిని అనుసరించినవాడు సుకృతాలు చేసినవాడు అవుతాడు,

## మూడో స్తంభశాసనం

## ప్రాకృత మూలం :

౧౭ (1) దేవానాంపియే పియదసి లాజ హేవం ఆహా (2) కయానం మేవ దేఖతి ఇయం మే

౧౮. కయానే కటే తి (3) నో మిన పాపం దేఖతి ఇయం మే పాపే కటే తి ఇయం వా ఆసినవే

౧౯ నామా తి (4) దుపటవెఖె చు ఖో ఏసా (5) హేవం చు ఖో ఏస దేఖియే (6) ఇమాని

౨౦ ఆసినవగామీని నామ అథ చండియే నిఠూలియే కోధే మానే ఇస్యా

౨౧ కాలనేన వ హకం మా పలిభసయిసం (7) ఏస బాఢ దేఖియే (8) ఇయం మే

౨౨. హిదతికాయే ఇయం మనమే పాలతికాయే

## సంస్కృతం:

(1) దేవానాం ప్రియః ప్రియదర్శీ రాజైవమాహ (2) కళ్యాణ మేవ [లోకః] పశ్యతి ఇదం మే కళ్యాణం కృతమితి (3) న మనుష్యః పాపం పశ్యతి ఇదం మే పాపం కృతమితి అయం వా ఆస్రవో నామేతి (4) దుష్ప్రత్యవేక్షం తు ఖల్వేతత్ (5) ఏవం తు ఖల్వేతద్ద్రష్టవ్యమ్ (6) ఇమాని ఆస్రవగామీని నామ యథా చణ్డత్వం నైష్ఠుర్యం క్రోదో మాన ఈర్ష్యా కారణాస వా అహం మా పరిభషిష్యే (7) ఏతద్బాఢం ద్రష్టవ్యం (8) ఇదం మే ఇహత్యాయ ఇదమన్యన్మే పారత్రికాయ.

## తెలుగు:

### పాపం తెలుసుకొనుట

(1) దేవతాప్రియుడయిన ప్రియదర్శి రాజు ఇట్లా చెప్తున్నాడు (2) "ఈ ధర్మ కార్యం నేను చేశాను" అని మనుష్యులు తమ ధర్మ కార్యాలనే గ్రహిస్తూ ఉంటారు (3) "నేను పాపం చేశాను ఇది పాపం" అని మనుష్యుడు ఎప్పుడూ అనుకోడు (4) అట్లాతెలిసికోవటం చాలా కష్టం కదా! (5) కాని దాన్నిగురించి ఇట్లా అనుకోవాలి (6) తీవ్రంగా

ఉండటం, నైష్ఠుర్యం, క్రోధం, మానం, ఈర్ష్య అనేవి తాపకారణాలు నేను వాటివల్ల నాశంపొందక ఉంటానుగాక" అని (7) ఈ కింది రీతిగా తప్పక అనుకోవాలి (8) "ఈ కార్యంవల్ల నాకు ఇహలోక సౌఖ్యం కలుగుతుంది ఈ కార్యంవల్ల పరలోక సౌఖ్యం కలుగుతుంది" అని

## నాలుగో స్తంభశాసనం

( స్తంభం పశ్చిమ ముఖం )

### ప్రాకృతమూలం :

౧ [1] దేవానంపియే పియదసి లాజ హేవం ఆహ [2] సడువీసతివస

౨. అభిసితేన మే ఇయం ధంమలిపి లిఖాపితా [3] లజూకా మే

3. బహూను పానసతసహసేసు జనసి అయుతా [4] తేసం యే అబి హాలే వా

౪ దండే వా అతపతియే మే కటె కింతి లజూకా అస్వద అబితా

౫. కంమాని పవతయేవూ జనస జానపదసా హితసుఖం ఉపదహేవూ

౬. అనుగహినేవు చా [5] సుఖీయన దుఖీయనం జానిసంతి ధంమ యుతేన చ

౭. వియోవదిసంతి జనం జానపదం కింతి హిదతం చ పాలతం చ

౮. అలాధయేవూ తి [6] లజూకా పి లఘంతి పటిచలితవే మం [7] పులిసాని పి మే

౯ ఛందంనాని పటిచలిసంతి [8] తే పి చ కాని వియోవదిసంతి యేన మం లజూకా

౧౦. చఘంతి అలాధయితవే [9] అథా హి పజం వియతాయే ధాతియే నిసిజితు

౧౧. అస్వథే హోతి వియత ధాతి చఘతి మే పజం సుఖం పలిహటవే

౧౨ హేవం మమా లజూకా కటా జానపదస హితసుఖాయే [10] యేన ఏతే అబీతా

౧౩ అస్వథ సంతం అవిమనా కంమాని పవతయేవూ తి ఏతేన మే లజూకానం

౧౪ అభిహాలే వ దండే వా అతపతియే కటే [11] ఇచితవియే హి ఏసా కింతి

౧౫ వియోహాలసమతా చ సియ దండసమతా చా [12] అవ ఇతే పి చ మే ఆవుతి

౧౬. బంధనబధానం మునిసానం తీలితదండానం పతవధానం తింని దివసాని మే

౧౭. యోతే దింనే [13] నాతికా వ కాని నిఝపయిసంతి జీవితాయే తానం

౧౮. నాసంతం వా నిఝపయితా దానం దాహంతి పాలతికం ఉపవాసం వ కచంతి

౧౯ [14] ఇచా హి మే హేవం నిలుధసి పి కాలసి పాలతం ఆలాధయేవూ తి [15] జనస చ

౨౦. వఢతి వివిధె ధంమచలనే సంయమే దానస విభాగే తి

## సంస్కృతం :

(1) దేవానాం ప్రియః ప్రియదర్శీ రాజైవమాహ (2) షడ్వింశతి వర్షాభిషిక్తేన మయేయం ధర్మలిపిర్లేఖితా (3) రజ్జుకా మే బహుషు ప్రాణశతసహస్రేషు జనేష్వాయత్తాః (4) తేషాం యోఽభిహారో వా దణ్డో వా ఆత్మప్రత్యయో మయా కృతః కిమితి రజ్జుకా అస్వార్థా అభీతాః కర్మాణి ప్రవర్తయేయుర్జనస్య జానపదస్య హితసుఖ ముపదధ్యురను

గృహ్ణీయుశ్చ (5) సుఖం దుఃఖం చ జ్ఞాస్యన్తి దర్మయుతేన చ వ్యపదేక్ష్యన్తి జనం జానపదం కిమితి ఇహత్యం చ పారత్రిత్యం చారాధయేయురితి (6) రజ్జుకాఅపి అబిలషన్తి పరిచరితు మాం (7) పురుషా అపి మే చన్దనాని పరిచరిష్యన్తి (8) తేఽపి చ క్రానా వ్యపదేక్ష్యన్తి యేన మాం రజ్జుకాః శ్రద్ధథతత్యారాదయితుమ్ (9) యథా హి ప్రజాం విదితాయై ధాత్ర్యై నిస్సృజ్య స్వస్థో భవతి విదితా ధాత్రీ శ్రద్ధధాతి మే ప్రజాం సుఖం పాలయిష్యత్యేవం మమ రజ్జుకాః కృతాః జానపదస్య హిత సుఖాయ (10) యేనైతే అభీతా అస్వార్థాః సన్తః అవిమనసః కర్మాణి ప్రవర్తయేయురిత్యేతేన మయా రజ్జుకానామభిహారో వా దణ్డో వా ఆత్మప్రత్యయః కృతః (11) ఏష్టవ్యో హ్యేష కిమితి వ్యవహారసమతా చ స్యాద్దణ్డసమతా చ (12) యావదితోఽపి చ మమాజ్ఞప్తిర్బంధనవదానాం మనుష్యాణాం నిర్ణీతదణ్డానాం ప్రతివిధానం త్రీణి దివసాని మయా యావద్దత్తం (13) జ్ఞాతీయావాక్యాని నిధ్యాపయిష్యన్తి జీవితాయ తేషాం నాశ్యన్తం వా నిధ్యాపయిత్వాదానం దదతి పారత్రికముపవాసం వా కరిష్యన్తి(14)ఇచ్ఛా హి మే ఏవం నిరుద్ధేఽపి కాలే పారత్ర్య మారాధయేయురితి (16) జనస్య చ వర్ధతే వివిధం ధర్మచరణం సంయమో దానస్య విభాగ ఇతి

తెలుగు :

## రాజూకులు (రజ్జుకులు)

(1) దేవతాప్రియుడయిన ప్రియదర్శిరాజు ఇట్లా చెప్తున్నాడు (2) నా రాజ్యాభిషిక్తకాలం ఇరవైఆరోసంవత్సరంలో ఈ దర్మలిపి లిఖించబడింది(3) నా రాజూకులు (రజ్జుకులు) లక్షలకొలది జనులతో సంబంధం కలిగిఉన్నారు (4)వారు తమ ధర్మాలను స్వార్థరహితంగా బయర హితంగా నిర్వర్తిస్తూ జానపదులకు హితం, సుఖం కలుగజేస్తూ, వారిని అనుగ్రహంతోచూస్తారని వారికి, బహుమానాలుఇవ్వటం, దండించటం

అనే అధికారాన్ని వదలివేశాను (5) వారు జనులకు సుఖాన్నికాని, దుఃఖాన్నికాని ఎట్లా కలిగించాలో తెలుసుకొని జానపదులకు ధర్మనిరతు లయినవారి ద్వారా దర్మాన్ని ఉపదేశిస్తూ, ఇహపర సౌఖ్యాలు పొందకలరు. (6) రజ్జుకులు నా ఆజ్ఞానుసారం ప్రవర్తించటానికి అభిలషిస్తారు (7) నా అభిప్రాయాలను ఎరిగిన (రాజ) పురుషులకు కూడా వారు పరిచర్య చేస్తుంటారు. (8) రజ్జుకులు నా ధర్మాన్ని పరిపాలించటంలో శ్రద్ధతీసుకోవటానికై జనులకు తాము ఉపదేశాలు చెస్తుంటారు (9) తెలివిగలదాదికి బిడ్డను ఒప్పచెప్పి "ఈ తెలివిగల దాది నా బిడ్డను బాగా పోషించకల" దని స్వస్థచిత్తంతో ఉండేటట్లే ఈ రజ్జుకులను జానపదుల హితంకొరకూ, సౌఖ్యంకొరకూ నేను నియోగించి ఉన్నాను. (10) వారు భయరహితులై, స్వార్థపరులుకాకుండా చలించనిచిత్తంతో తమ ధర్మాలను ఆచరిస్తారనే ఆ రజ్జుకులకు బహుమానాలు ఇవ్వటం, దండాలు విధించటం అనే అధికారాలను వదిలిపెట్టి ఉన్నాను (11) వ్యవహార పరిష్కారంలో, దండంవిధించటంలో సమబుద్ధి ఉండటం కోరదగిందికదా! (12) నా ఆజ్ఞ దూరస్థులైన రజ్జుకులకు చేరటానికై మూడుదినాలవ్యవధి పట్టుంది, కనుక ఎవరికైనా కారగృహవాసశిక్షకాని, మరణశిక్షకాని విధించినప్పుడు వెంటనే ఆ శిక్షను ప్రయోగించకుండా మూడుదినాలవరకూ వేచి ఉండాలని నెను విధించి ఉన్నాను. (13) ఇట్లా వ్యవధి ఇవ్వటంచేత వారి బంధువులు రజ్జుకులను ప్రాణదానంచేయమని వెడుకోవటమో, వారికి బంధువులు లేకుంటే దానాలనుచేసి, పరలోక సౌఖ్యంకొరకు ఉపవాసాలను ఆచరించి, ఆ మూడుదినాలు గడుపుతారనె ఉద్దేశంతో నెను ఇట్లా ఆజ్ఞాపించాను (14) ఇట్లా వ్యవధికాలం దాటిపోయినా పరలోక సౌఖ్యాన్నైనా వారు పొందాలనేదె నా కోరిక. (15) ఇందువల్ల వివిధ ధర్మాచరణాలు, సంయమం, దానవిభాగం జనులలో వర్ధిల్లుతాయి

## అయిదో స్తంభశాసనం

(స్తంభం దక్షిణ ముఖం)

### ప్రాకృత మూలం :

౧. (1) దేవానంపియే పియదసి లాజ హేవం అహా (2) సడువీసతివస
౨. అభిసితేన మే ఇమాని జాతాని అవధియాని కటాని సే యథా
౩. సుకే సాలికా అలునే చకవాకే హంసే నందీముఖే గేలాటే
౪ జతూకా అంబాకపీలికా దళి అనఠికమచే వేదవెయకే
౫. గంగాపుపుటకే సంకుజమచే కపటసయకే పంనససే సిమలే
౬. సండకే ఓకపిండే పలసతే సేతకపొతే గామకపొతే
౭. సవే చతుపదే యే పటిభోగం నో ఏతి న చ ఖాదియతీ . ...
౮. (3) ఏళకా చా సూకలీ చా గభినీ వ పాయమీనా వ అవధియ (పోతకె)
౯. పి చ కాని ఆసంమాసికే (4) వధికుకుటే నో కటవియే (5) తుసే సజీవే
౧౦. నో ఝాపేతవియే (6) దావే అనఠాయే వా విహింసాయే వా నో ఝాపేతవియే
౧౧. (7) జీవేన జీవే నొ పుసితవియే (8) తీసు చాతుంమాసీసు తిసాయం పుంనమాసియం
౧౨. తింని దివసాని చావుదసం పంనడసం పటిపదాయే ధువాయే చా
౧౩. అనుపొసథం మచే అవధియే నో పి వికేతవియే (9) ఏతాని యేవా దివసాని

౧౪ నాగవనసి కేవటభోగసి యాని అంనాని పి జీవనికాయాని

౧౫. నో హంతవియాని [10] అఠమీపఖాయే చావుదసాయే పంనడ సాయే తిసాయే

౧౬ పునావసునే తీసు చాతుంమాసీసు సుదివసాయే గోనే నో నీలఖిత వియే

౧౭. అజకే ఏడకే సూకలే ఏ వా పి అంనే నీలఖియతి నో నీలఖితవియే

౧౮ (11) తిసాయే పునావసునే చాతుంమాసియే చాతుంమాసిపఖాయే అస్వసా గోనసా

౧౯. లఖనే నొ కటవియే (12) యావ సడువీసతివసఅభిసితేన మే ఏతాయే

౨౦. అంతలికాయే పంనవీసతి బంధనమోఖాని కటాని

## సంస్కృతం :

[1] దేవానాంప్రియః ప్రియదర్శీ రాజైవమాహ [2] షడ్వింశతి వర్షాభిషిక్తేన మయా ఇమాని జాతాన్యవధ్యాని కృతాని యథా శుకః సారికా అరుణః చక్రవాకో హంసః నాన్దీముఖో గేలాటః జతుకా అంబాకపీలికా దుడిః అనస్థికమత్స్యః జీవంజీవకః గఙ్గాకుక్కుటకః శకులమత్స్యః కమఠః శల్యః పర్ణశశః సృమరః షణ్డకః ఓకపిణ్డః పృషతః శ్వేతకపోతః గ్రామకపోతః సర్వశ్చతుష్పదో యః పరిభోగం నైతి న చ ఖాద్యతే [3] ఏడకా వా సూకరీ వా గర్భిణీ వా పయస్వినీ వా అవధ్యాః పోతకా అపి చాషాణ్మాసికా [4] వధ్రికుక్కుటో న కర్తనీయః [5] తుషాః సజీవా న దగ్ధవ్యా [6] దావోనర్థాయ వా విహింసాయై వా న దగ్ధవ్యో [7] జీవేన జీవో న పోష్టవ్యః [8] తిస్రషు చాతుర్మాసీసు తిష్యపౌర్ణమాస్యాం త్రీణి దివసాని చతుర్దశ్యాం పంచదశ్యాం ప్రతిపది ధ్రువాయా

చానుపోషథం మత్స్యాః అవధ్యాః నాపి చ విక్రేతవ్యాః [9] ఏతాన్యేవ దివసాని నాగవనే కైవర్తభాగే యే చాన్యేపి జీవ నికాయా స్తే న హన్తవ్యాః [10] అష్టమ్యాం పక్షయోశ్చతుర్దశ్యాం పంచదశ్యాం తిష్యే పునర్వసౌ తిసృషు చాతుర్మాసీషు సుదివశేషు వా గౌర్న నిర్లకితవ్యః అజకః ఏడకః సూకరో యో వాపి అన్యోనిర్లక్ష్యతే (స) స నిర్లకితవ్యః [11] తిష్యే పునర్వసౌ చాతుర్మాస్యే చాతుర్మాస్య పక్షయోః అశ్వస్య గోః లాఞ్ఛనం స కర్తవ్యమ్ [12] యావత్ షద్వింశతివర్షాభిషిక్తేన మయా ఏతస్మిన్నన్తరే పఞ్చవింశతిర్బన్ధన మోకాః కృతాః

తెలుగు :

## అవధ్య ప్రాణులు

[1] దేవానాంప్రియుడయిన ప్రియదర్శిరాజు ఇట్లా చెప్తున్నాడు [2] నా రాజ్యాభిషిక్తకాలం ఇరవైఆరోసంవత్సరంలో చిలుకలు, మైనాలు, అరుణపక్షులు, చక్రవాకాలు, హంసలు, నాందీముఖపక్షులు, గేలాటపక్షులు, గబ్బిలాలు, చెదపురుగులు, చీమలు, ఎముకలులేని చేపలు, జీవంజీవకాలు, నీటికోళ్లు, శకులమద్యాలు, తాబేళ్లు, ముళ్ల పందులు, ఉడుతలు, సుమరాలు, యదేచ్ఛగ విడిచిపెట్టిన అబోతులు, ఓకపిండాలు, ఖడ్గమృగాలు, తెలపావురాళ్లు, ఊరిపావురాళ్లు, అనుపయోగాలు అభోజ్యాలు అయిన చతుష్పాదజంతువులు, ఇట్టి ప్రాణులను చంపకూడదని నేను ఆజ్ఞాపించి ఉన్నాను [3] మేకలు, గొర్రెలు, పందులు, ఇవి కడుపుతోఉన్నా పాలిస్తున్నవైనా, వాటిని చంపకూడదు ఆరునెలలకు తక్కువయిన వీటి పిల్లలనుకూడా చంపకూడదు [4] కోళ్లను కోయకూడదు. [5] జీవజంతువులను ఊకలోపెట్టి కాల్చడదు. [6] నిరర్థకంగా, అక్కడ జంతువులను నాశనంచేయటానికిగా, అడవులను తగులపెటకూడదు. [7] జీవజంతువులను ఆహారంగా

పెట్టకూడదు [8] మూడు చాతుర్మాస్యదినాలలో, పుష్యపూర్ణిమనాడు, చతుర్దశి, పున్నమ లేక అమావాస్య, పాడ్యమి తిథులలో, ఉపవాస దినాలలో చేపలను చంపకూడదు, వాటిని అమ్మకూడదు. [9] ఆదినాలలో, నాగవనంలో ఉన్న ఎట్టిప్రాణులను కూడా చంపకూడదు [10] రెండుపక్షాలలో, అష్టమి, చతుర్దశి, అమావాస్య, తిష్య, పునర్వసు నక్షత్రాలు, మూడు చాతుర్మాస్యదినాలు, పర్వదినాలు,- ఈ దినాలలో వృషణాలు తీసివేయకూడదు. ఇంతకుపూర్వం వృషణాలు తీయబడ్డ గొర్రెలు, పొట్టేళ్ళు, పందులు, మొదలయినవాటికి మరలా వృషణాలు తీయకూడదు. [11] తిష్య, పునర్వసు నక్షత్రాలలో, చాతుర్మాస్య దినాలలో, చాతుర్మాస్యంలోనిప్రతిపక్షంలో, గుర్రాలకు, గోవులకు చురకలు వేయకూడదు [12] నేను రాజ్యాభిషిక్తుణ్ణయిన ఈ ఇరవైఆరు సంవత్సరాలలో ఇరవైఅయిదుసార్లు కారాగృహవాసులను విడుదలచేయించాను.

## ఆరో స్తంభశాసనం

( తూర్పు ముఖం )

### ప్రాకృత మూలం :

౧ (1) దెవానంపియే పియదసి లాజ హేవం ఆహా (2) దువాడస-

౨ వస అభిసితేన మె ధంమలిపి లిఖాపితా లోకసా

3. హితసుఖాయే సె తం అపహటా తం తం ధంమవడి పాపొవా

౪. (3) హేవం లోకసా హితసుఖే తి పటివేఖామి అథ ఇయం

౫. నాతిసు హేవం పతియాసంనెసు హేవం అపకఠేసు

౬. కిమం కాని సుఖం ఆవహామీ తి తథ చ విదహామి (4) హేమేవా

౭ సవనికాయేసు పటివేఖామి (5) సవపాసండా పి మే పూజితా
౮. వివిధాయ పూజాయా (6) ఏ చు ఇయం అతనా పచూపగమనే
౯ సే మే మోఖ్యమతే (7) సడువీసతివస అభిసితేన మే
౧౦. ఇయం ధంమలిపి లిఖాపితా

సంస్కృతం :

(1) దేవానాం ప్రియః ప్రియదర్శీ రాజా ఏవమాహ (2) ద్వాదశవర్షాభిషిక్తేన మయా ధర్మలిపిర్లేఖితా లోకస్య హితసుఖాయ, తత్తదపహృత్య సా సా ధర్మవృద్ధిః ప్రాప్తవ్యా (3) ఏవం లోకస్య హిత సుఖే ఇతి ప్రత్యవేక్షే, యదేదం జ్ఞాతిషు ఏవం ప్రత్యాసన్నేషు ఏవమప కృష్టేషు కిం కేషాం సుఖమావహామీతి తథా చ విదధే (4) ఏవమేవ సర్వనికాయేషు ప్రత్యవేక్షే(5)సర్వపాషణ్డా అపి మే పూజితా వివిధయా పూజయా (6) యత్తు ఇదం ఆత్మనా ప్రత్యుపగమనం తన్మే ముఖ్య మతమ్ (7) షడ్వింశతివర్షాభిషిక్తేన మయేయం ధర్మలిపిర్లేఖితా

తెలుగు :

## జనుల ధర్మాభివృద్ధి

(1) దేవతాప్రియుడయిన ప్రియదర్శిరాజు ఇట్లా చెప్తున్నాడు (2) నేను రాజ్యాభిషిక్తుడనయిన పన్నెండోసంవత్సరంలో జనుల హితం కొరకూ సౌఖ్యంకొరకూ, ఈ శాసనాలను అతిక్రమించకుండా అనేకవిధాల వారు ధర్మాభివృద్ధిపొందడానికి ఈ ధర్మలిపులు నాచేత లిఖించబడ్డాయి. (3) "ఈ విధంగా జనులకు హితం, సౌఖ్యం కలుగు తుంది" అని తలచి నా బంధువులనే కాక దగ్గర ఉన్నవారిని దూరంగా ఉన్నవారిని కూడా సౌఖ్యవంతులుగా చేయటంలో శ్రద్ధవహించి అట్లే

వారికి ధర్మోపదేశం చేస్తున్నాను. (4) ఈ విధంగానే సర్వశాఖలవారిపట్ల శ్రద్ధవహించి ఉన్నాను. (5) సమస్తశాఖలవారూ వివిధపూజలచేత నావల్ల గౌరవింపబడిఉన్నారు (6) జనులవద్దకు నేను స్వయంగా పోవటమే నా ముఖ్యమతం అయివుంది. (7) నా రాజ్యాభిషిక్తకాలం ఇరవైఆరోఏట నాచేత ఈ ధర్మలిపి లిఖించబడింది.

## ఏడో స్తంభశాసనం

### (తూర్పు ముఖం)

### ప్రాకృతమూలం :

౧౧ (1) దేవానంపియే పియదసి లాజా హేవం ఆహా (2) యే అతి కంతం

౧౨ అంతలం లాజానే హుసు హేవం ఇఛిసు కథం జనే

౧౩ ధంమవడియా వఢేయా నో చు జనె అనులుపాయా ధంమవఢియా

౧౪ వడిఢా (3) ఏతం దేవానంపియే పియదసి లాజా హేవం ఆహా (4) ఏస మే

౧౫ హుథా (5) అతికంతం చ అంతలం హేవం ఇఛిసు లాజానే కథం జనె

౧౬ అనులుపాయా ధంమవడియా వఢేయా తి నో చ జనే అనులుపాయా

౧౭ ధంమవడియా వడిఢా (6) సె కినసు జనె అనుపటిపజేయా

౧౮ (7) కినసు జనే అనులుపాయా ధంమవఢియా వఢేయా తి (8) కినసు కాని

౧౯. అభ్యంనామయేహం ధంమవఢియా తి (9) ఏతం దేవానాంపియే పియదసి లాజా హేవం

౨౦. ఆహా (10) ఏస మే హుథా (11) ధంమసావసాని సావాపయామి ధంమానుసథిని

౨౧. అనుసాసామి (12) ఏతం జనే సుతు అనుపటీపజీసతి అభ్యం- నమిసతి

స్తంభం చుట్టూ

౨౨ దంమపడియా చ భాడం వఢిసతి (13) ఏతాయే మే అఠాయే దంమసావనాని సావాపితాని ధంమానుసథిని వివిదాని ఆనపితాని యథా పులిసా పి బహునె జనసి ఆయతా ఏ తే పలియోవదిసంతి పి పవిదలిసంతి పి (14) లజూకా పి బహుకేసు పానసతసహసేసు ఆయుతా తే పి మే ఆనపితా హేవం చ హేవం పలియోవదాథ

౨౩. జనం దంమయుతం (15) దెవానాంపియే పియదసి హేవం ఆహా (16) ఎతమేవ మే అనువేఖమానె ధంమదంబాని కటాని ధంమ మహామాతా కటా దంమ సావనేకటే (17) దేవానాంపియే పియదసి లాజా హేవం ఆహా (58) మగేసు పి మే నిగోహని లోపాపితాని చాయోపగాని హొహంతి పసుమునిసానం అంబావడిక్యా లోపాపితా (19) అడకోసిక్యాని పి మే ఉదుపానాని

౨౪. ఖానాపాపితాని నింసిఢయా చ కాలాపితా (20) ఆపానాని మే బహుకాని తత తత కాలాపితాని పటీభొగాయే పసుమునిసానం (21) లహుకే చు ఏస పటీభోగే నామ (22) వివిధాయా హి సుఖాయనాయా పులిమేహి పి లాజీహి మమయా చ సుఖయితే లోకే (23) ఇమం చు ధంమానుపటిపతీ అనుపటీపజంతు తి ఏతదథా మే

౨౫. ఏస కటే (24) దేవానాంపియే పియదసి హేవం ఆహా (25)ధం-
మమహామాతా పి మే తే బహువిధేసు అఠేసు అనుగహి కేసు
వియాపటాసే పవజీతానాం చేవ గిహిథానం చ సవపాసండేసు పి
చ వియాపటాసే (26) సంఘఠసి పి మే కటే ఇమే వియాపటా
హోహంతి తి హేమేవ బాభనేసు ఆజీవికేసు పి మే కటే

౨౬. ఇమే వియాపటా హోహంతి తి నిగంఠేసు పి మే కటే ఇమే
వియాపటా హోహంతి నానాపాసండేసు పి మే కటే ఇమే వియా-
పటా హోహంతి తి పటివిసిఠం తేసు తేసు తే మహామాతా (27)
ధంమమహామాతా చు మే ఏతేసు చేవ వియాపటా సవేసు చ
అంనేసు పాసండేసు (28) దేవానంపియే పియదసి లాజా హేవం
ఆహా

౨౭. (29)ఏతే చ అంనే చ బహుకా ముఖా దానవిసగసి వియాపటాసే
మమ చేవ దేవినం చ సవసి చ మే ఓలోధనసి తే బహువిధేన
ఆకాలేన తాని తాని తుఠాయతనాని పటీపాదయంతి హిద చేవ
దిసాసు చ (30) దాలకానం పి చ మే కటే అంనానం చ దేవి-
కుమాలానం ఇమే దానవిసగేసు వియాపటా హోహంతి తి

౨౮ ధంమాపదానఠాయే ధంమానుపటిపతియే (31) ఏస హి
ధంమాపదానె ధంమపటీపతి చ యా ఇయం దయా దానె సచే
సోచవె మదవే సాధవె చ లోకస హేవం వఢిసతి తి (32)
దెవానాంపియే పియదసి లాజా హేవం ఆహా (33) యాని హి
కానిచి మమియా సాధవాని కటాని తం లోకే అనుపటీపంనే తం
చ అనువిధియంతి (34) తేన వఢితా చ

౨౯. వఢిసంతి చ మాతాపితుసు సుసూసాయా గులుసు సుసూసాయా
వయోమహాలకానం అనుపటీపతియా బాభనసమనేసు కపనవలా-
కేసు ఆవ దాసభటకేసు సంపటీపతియా (35) దెవానాంపియే

పియదసి లాజా హేవం ఆహ (36) మునిసానం చు యా ఇయం ధంమవఢి వఢితా దువేహి యేవ ఆకాలేహి ధంమనియమేన చ నిఝతియా చ

౩౦. (37) తత చు లహు సే ధంమనియమే నిఝతియా వ భుయే (38) ధంమనియమే చు ఖో ఏస యే మే ఇయం కటె ఇమాని చ ఇమాని జాతాని అవధియాని (39) అంనాని పి చు బహుకాని ధంమనియమాని యాని మే కటాని (40) నిఝతియా వ చు భుయే మునిసానం ధంమవఢి వఢితా అవిహింసాయే భుతానం

౩౧ అనాలంభాయే పానానం (41) సే ఏతాయే అథాయే ఇయం కటే పుతాపపోతికే చందమసులియికే హోతు తి తథా చ అను పటీపజంతు తి (42) హేవం హి అనుపటీపజంతం హిదతపాలతే ఆలధే హోతి (43) సతవిసతివసాభిసితేన మే ఇయం ధంమలిపి లిఖాపాపితా తి (44) ఏతం దేవానంపియే ఆహ (45) ఇయం

౩౨. ధంమలిబి అత అథి సిలా థంభాని వా సిలాఫలకాని వా తత కటవియా ఏన ఏస చిలఠితికే సియా

## సంస్కృతం :

(1) దేవానాంప్రియః ప్రియదర్శీ రాజా ఏవమాహ (2) యదతిక్రాన్తమన్తరం రాజానోఽభవన్నేవమైచ్ఛన్ కథం జనే ధర్మవృద్ధిర్వర్ధనీయా న తు జనేఽనురూపా ధర్మవృద్ధిర్వర్ధితా(3)అత్ర దేవానాం ప్రియః ప్రియదర్శీ రాజా ఏవమాహ (4) ఏతన్మే భూతమ్ (5) అతిక్రాన్తమన్తరమేవ మైచ్ఛన్రాజానః కథం జనేఽనురూపా ధర్మవృద్ధిర్వర్ధనీయేతి న చ జనేఽనురూపా ధర్మవృద్ధిర్వర్ధితా (6) తత్కేనస్విత్ జనోనుప్రతిపద్యేత (7)కేనస్విత్ జనేఽనురూపా ధర్మవృద్ధిర్వర్ధనీయేతి(8) కేనస్విత్ కేషామభ్యున్నమయేహం ధర్మవృద్ధిమితి (9) అత్ర దేవానాం ప్రియః

ప్రియదర్శీ రాజైవమాహ (10) ఏతస్మై భూతం (11) ధర్మశ్రావణాని శ్రావయామి ధర్మానుశిష్టిరనుశాస్మి (12) ఏతాని జనః శ్రుత్వా అనుప్రతిపత్స్యతే అభ్యున్నంస్యన్తి ధర్మవృద్ధిశ్చ బాఢం వర్ధిష్యతే (13) ఏతస్మై మయా అర్థాయ ధర్మశ్రావణాని శ్రావితాని ధర్మానుశిష్టయో వివిధా ఆజ్ఞాపితాః యథా మే పురుషా అపి బహుషు జనేష్వాయుక్తాః ఏతే పరితో వదిష్యన్త్యపి ప్రవిస్తారయిష్యన్త్యపి(14)రజ్జుకా అపి బహుషు ప్రాణశతసహస్రేష్వాయుక్తాస్తేఽప్యాజ్ఞప్తా ఏవం చ ఏవం చ పరితో వదత జనం ధర్మయుతమ్ (15) దేవానాంప్రియః ప్రియదర్శీ ఏవమాహ (16) ఏతదేవ మయానువీక్షమాణేన ధర్మస్తమ్భాః కృతా ధర్మమహామాత్రాః కృతాః ధర్మశ్రావణమ్ కృతమ్ (17)దేవానాం ప్రియః ప్రియదర్శీ రాజైవమాహ (18) మార్గేష్వపి మయా న్యగ్రోధా రోపితాశ్ఛాయోపగా భవిష్యన్తి పశుమనుష్యాణాం ఆమ్రవటికా రోపితా(19)అర్ధక్రోశకాన్యపి మే ఉదపానాని ఖానితాని నిశాగృహాణి చ కారితాని (20) ఆపానాని మయా బహుకాని తత్ర తత్ర కారితాని ప్రతిభోగాయ పశుమనుష్యాణాం (21) లఘుస్తు ఏష ప్రతిభోగో నామ (22) వివిధైర్హి సుఖైః పూర్వైరపి రాజభిర్మయా చ సుఖితో లోకః (23) ఇమాం తు ధర్మానుప్రతిపత్తిమనుప్రతిపద్యన్తామితి ఏతదర్థం మయైతత్కృతమ్ (24) దేవానాం ప్రియః ప్రియదర్శీ ఏవమాహ (25) ధర్మమహామాత్రా అపి మయైతే బహువిధేష్వర్థేష్వానుగ్రహికేషు వ్యాపృతాస్తే ప్రవ్రజితేషు చైవ గృహస్థేషు చ సర్వపాషణ్డేష్వపి చ వ్యాపృతాః (26) సంఘార్థేఽపి మే కృతే ఇమే వ్యాపృతా భవన్తీతి ఇమేఏవ బ్రాహ్మణేష్వాజీవకేష్వపి మే కృతే ఇమే వ్యాపృతా భవన్తి నిర్గ్రన్థేష్వపి మే కృతే ఇమే వ్యాపృతా భవన్తి నానాపాషణ్డేష్వపి మే కృతే ఇమే వ్యాపృతా భవన్తీతి ప్రతివిసృష్టాః ప్రతివిసృష్టాస్తేషు తేషు తే తే (27)ధర్మమహామాత్రాస్తు మయైతేషు చైవ వ్యాపృతాః సర్వేషు చాన్యేషు పాషణ్డేషు (28)దేవానాం ప్రియః ప్రియదర్శీ

రాజైవమాహ (29) ఏతే చాన్యే చ బహవో ముఖ్యా దానవిసర్గే వ్యాపృతాస్తే మమ చైవ దేవీనాం చ సర్వస్మింశ్చ మమావరోధనే తే బహువిధేనాకారేణ తాని తాని తుష్టచ్యాతనాని ప్రతిపాదయన్తి ఇహ చైవ దిశాసు చ (30) దారకాణామపి చ మయా కృతా అన్యేషాం చ దేవీకుమారాణామిమే దానవిసర్గేషు వ్యాపృతా భవన్తీతి ధర్మాపదానార్థాయ ధర్మానుప్రతిపత్తయే (31) ఏతద్ధి ధర్మాపదానం ధర్మప్రతిపత్తిశ్చ యేయం దయా దానం సత్యం శౌచం మాదః సాధుతా చ లోకస్యైవం వర్ధిష్యతే ఇతి (32) దేవానాం ప్రియః ప్రియదర్శీ రాజైవమాహ (33) యాని హి కానిచిన్మయా సాధూని కృతాని తాని లోకః అనుప్రతిపన్నస్తాని చానువిదధాతి (34) తేన వర్ధితా చ వర్ధిష్యతే చ మాతాపిత్రోః శుశ్రూషా గురుషు శుశ్రూషా వయోమహతా మనుప్రతిపత్తిర్బ్రాహ్మణశ్రమణేషు కృపణవరాకేషు యావద్దాసభృతకేషు సంప్రతిపత్తిః (35) దేవానాం ప్రియః ప్రియదర్శీ రాజైవమాహ (36) మనుష్యాణాం తు యేయం ధర్మవృద్ధిర్వర్ధితా ద్వాభ్యామేవాకారాభ్యాం ధర్మనియమేన చ నిధ్యాత్యా చ (37) తత్ర చ లఘుః స ధర్మనియమో నిధ్యాతిర్భూయసీ (38) ధర్మనియమస్తు ఖల్వేష యో మయాయం కృత ఇమాని చేమాని చ జాతాన్యవధ్యాని (39) అన్యేపి తు బహవో ధర్మనియమా యే మయా కృతాః (40) నిధ్యాత్యైవ తు భూయో మనుష్యాణాం ధర్మవృద్ధిర్వర్ధితా అవిహింసాయై భూతానామనాలంభాయ ప్రాణానామ్ (41) తదేతస్మాయర్థాయేదం కృతం పుత్రపౌత్రికం చన్ద్రమః సూర్యకం భవత్వితి తథా చానుపద్యన్తామితి (42) ఏవం హి అనుప్రతిపద్యమానానామైహత్యం చ పారత్ర్యం చారాద్ధం భవతి (43) సప్తవింశతివర్షాభిషిక్తేన మమేయం ధర్మలిపిర్లేఖితేతి(44)ఏతద్దేవానాం ప్రియ ఆహ(45) ఇయం ధర్మలిపిర్యత్రాస్తి శిలాస్తమ్భా వా శిలాఫలకాని వా తత్ర కర్తవ్యా యేనైషా చిరస్థితికా స్యాత్.

తెలుగు :

## అశోక ధర్మం - సమీక్ష

(1) దేవానాంప్రియుడయిన ప్రియదర్శిరాజు ఇట్లు చెప్తున్నాడు (2) పూర్వకాలంలో జనులలో ధర్మవృద్ధిని రాజులు కోరుతుండినారు. కాని ఆయా జనులకు అనురూపమయిన ధర్మవృద్ధి జరుగలేదు [3]ఈ విషయంగా దేవానాంప్రియుడయిన ప్రియదర్శిరాజు ఇట్లా చెప్తున్నాడు. [4] నేనిట్లు తలచాను. [5] ఒకపక్క జనులు తమకు అనురూప మయిన ధర్మవృద్ధిని పొందవలెనని రాజులు కోరుతుండినారు. కాని, మరొకపక్క జనులకు అనురూపమయిన ధర్మవృద్ధి కలుగలేదు. [6] అయినా, జనులు ధర్మపరులుగా ఎట్లుండకలరు? [7] జనులలో తమకు అనురూపమయిన ధర్మవృద్ధి ఎట్లా జరుగుతుంది? (8) ధర్మ-వృద్ధిచేసి వారిని నేనెట్లు పైకితీసుకోరాగలను? (9) ఈ విషయంగా దేవానాంప్రియుడు ఇట్లా చెప్తున్నాడు. (10) నేనిట్లా ఆలోచించాను. (11) నేను ధర్మశ్రావణాలను వినిపిస్తాను, ధర్మానుశాసనాలను చేస్తాను. (12) జనులు వీటినివిని, ధర్మాన్ని అవలంబించి, ఉన్నతినిపొంది, ధర్మవృద్ధివల్ల మిక్కిలి అభివృద్ధి పొందుతారు. (13) ఇందుకుగా ధర్మశ్రావణాలు వినిపించాను వివిధధర్మానుశాసనాలను చేశాను. బహుజనాలతో సంబంధం ఉన్న నా "పురుషులు" ఈ జనులకు ధర్మాన్నిబోధిస్తూ దానినివిస్తరించి చెప్తారనే నేనిట్లుచేశాను (14) లక్షల కొలదిజనులతో సంబంధం ఉన్న రజ్జుకులను కూడా, "ధర్మనిరతు లయినజనులకు మీరు ఈ విధంగా హెచ్చరించాలి" అని ఆజ్ఞాపించాను (15) దేవానాంప్రియుడయిన ప్రియదర్శి ఇట్లాచెప్తున్నాడు. (16) ఈ విషయాన్ని గుర్తించే నేను ధర్మస్తంభాలను నిలిపాను ధర్మ మహా మాత్రులను నియమించాను. ధర్మశ్రావణాలను వినిపించాను (17)

దేవానాంప్రియుడయిన ప్రియదర్శిరాజు ఇట్లా చెప్తున్నాడు. (18) మార్గాలలో పశువులకు, మనుష్యులకు నీడ ఉండేందుకై మర్రిచెట్లను వేయించాను, మామిడితోటలను వేయించాను. (19) ఎనిమిదిక్రోసుల కొకటిచొప్పున నూతులనుతవ్వించి, వాటిలోనికి దిగటానికి మెట్లు కట్టించాను (20) పశువుల, మనుష్యుల ఉపయోగంకోసం అనేక పానశాలలు నిర్మించాను (21) కాని ఈ ఉపయోగం అంత ముఖ్యమయింది కాదు. (22) పూర్వరాజులచేతా, నాచేతా కూడా లోకం అనెక సుఖాలచేత సుఖపడేటట్లు చేయబడింది. (23) కాని, జనులు ధర్మానుప్రతిపత్తి కలిగి వర్తింతురనే నేనీ కార్యాలను చేశాను. (24) దేవానాంప్రియుడయిన ప్రియదర్శి ఇట్లా చెప్తున్నాడు. (25) సన్యాసులకు, గృహస్థులకు ఉపయోగపడే అనేకవ్యవహారాలలో, సమస్తశాఖల వారి వ్యవహారాలలో, ఆ నా ధర్మమహామాత్రులు వ్యాపృతులయి ఉన్నారు (26) సంఘాలవ్యవహారాలలో వ్యాపృతులయి ఉండాలని కొందరు మహామాత్రులను ఆజ్ఞాపించాను. అట్లే మరికొందరు బ్రాహ్మణుల, ఆజీవికుల వ్యవహారాలను చూస్తూ ఉండాలని ఆజ్ఞాపించాను కొందరు నిర్గ్రంధులవ్యవహారాలను చూస్తూ ఉండాలని ఆజ్ఞాపించాను ఈ రీతిగా వివిధమహామాత్రులను, వివిధ సంఘాలవారివ్యవహారాలు చూడటానికి నియోగించాను (27)కాని నా ధర్మ మహామాత్రులు తమకు నియమించబడిన సంఘాలవారియందు మాత్రమేకాక, ఇతర శాఖల జనులలో కూడా వ్యాపృతులై ఉన్నారు. (28) దేవానాంప్రియుడయిన ప్రియదర్శిరాజు ఇట్లా చెప్తున్నాడు (29) వీరూ నా ముఖ్యులలో అనేకులు నా దానాలను నా రాణుల దానాలను పంచిపెట్టూ నా అంతఃపురంలోనూ, నా రాజ్యంలోనూ, నా ఇతర రాష్ట్రాలలోనూ, దాన గ్రహణార్హులయిన వివిధజనులను గూర్చి అనేక రీతులుగా తెలుపుతున్నారు. (30) ,ధర్మకార్యాభివృద్ధికొరకు, ధర్మానుప్రతిపత్తి

కొరకు, నా పుత్రులు, ఇతరరాణులపుత్రులు చేసే దానాలను పంచి పెట్టటంలో వ్యాపృతులయి ఉండేటట్లుగా నేను మరికొందరిని నియోగించాను (31) దయ, దానం, సత్యం, శౌచం, మోదం, సాధుత్వం అనేవాటితోకూడిన ధర్మాన్ని ఆచరించటమే ధర్మాపదానమనీ అదే ధర్మప్రతిపత్తిఅనీ దానిని జనులలో వర్ధిల్లచేశాను. (32) దేవానాం ప్రియుడయిన ప్రియదర్శిరాజు ఇట్లా చెప్తున్నాడు. (33) నేనుచేసిన సాధుకార్యాలను లోకం అనుకరించి తానూ అవలంబిస్తున్నది (34) అందుమూలాన, మాతాపితృశుశ్రూష, గురుశుశ్రూష పెద్దలపట్ల, మహాత్ములపట్ల భక్తి, బ్రాహ్మణులు, శ్రమణులు, దీనులు, వృద్ధులు, దాసులు. భృత్యులు అయినవారిపట్ల అనురాగం వర్ధిల్లచేయబడ్డాయి, ఇకముందూ వర్ధిల్లచేయబడుతాయి (35) దేవానాంప్రియుడయిన ప్రియదర్శిరాజు ఇట్లా చెప్తున్నాడు. (36) ఇప్పుడీ ధర్మవృద్ధి జనులలో ధర్మనియమంవల్ల. ధర్మాన్ని అవలంబింపచేయడంవల్ల, - ఈ రెండు మార్గాలలో చేయబడింది. (37) కాని, ఈ రెండు మార్గాలలో ధర్మ నియమం అంతముఖ్యమయింది కాదు ధర్మాన్ని అవలంబింప చేయటమే ముఖ్యమయింది. (38) కొన్నిజంతువులను చంపకూడదని ఆజ్ఞాపించటమే నేనుచేసిన ధర్మనియమం (39) కాని, నేనుచేసిన ధర్మనియమాలు ఇంకా అనేకం ఉన్నాయి (40) అయినా, ధర్మాన్ని అవలంబింపచేయటంచేత జనులలో ఎక్కువ ధర్మవృద్ధి కలిగింది అందువల్ల జీవజంతువులకు బాధకలిగించటం, జంతువులను చంపటం ఆగిపోయింది (41) నా పుత్రులు, పౌత్రులూ రాజ్యంచేస్తూఉన్నంత కాలమూ, సూర్యచంద్రులు కలంతకాలమూ నిలుస్తుందని, జనులు దానిని అనుసరిస్తారని, నేను ఈ అనుశాసనాన్ని చేశాను. (42) జనులు దీనిని అనుసరిస్తే, ఇహంలో, పరంలో సౌఖ్యాలు పొందుతారు. (43) నేను రాజ్యాభిషిక్తుణ్ణి అయిన ఇరవైఏడేసంవత్సరంలో ఈ ధర్మలిపి

నాచేత లిఖించబడింది. (44) దీనివిషయంగా దేవానాంప్రియుడు చెప్పుచున్నాడు (45) ఈ ధర్మలిపి చిరస్థాయి అయిఉండటానికి, శిలా స్తంభాలు కాని, శిలాపలకాలు కాని దొరకేచోట్లలో అంతా లిఖింప బడాలి.

# లఘు స్తంభశాసనాలు

## రాణీ స్తంభశాసనం

## అలహాబాదు - కోసం స్తంభం

(గమనిక ఈ రాణీ స్తంభశాసనం, ఈ స్తంభంమీద. మొదటి ఆపస్తంభశాసనాల తర్వాత ఉన్నది )

### ప్రాకృత మూలం :

౧ (1) దేవానాంపియసా వచనేనా సవత మహమతా
౨ వతవియా (2) ఏ హేత దుతియాయే దేవీయే దానే
౩. అంబావడికా వా ఆలమే వ దానగహే వ ఏ వా పి అంనే
౪, కిఛిగనియతి తాయే దెవియే షె నాని (3) హేవం (వి) న (తి)
౫ దుతీయాయే దెవియే తి తీవలమాతు కాలువాకియే

### సంస్కృతం :

(1) దెవానాం ప్రియస్య వచనేన సర్వత్ర మహామాత్రా వక్తవ్యాః (2) యదత్ర ద్వితీయస్యా దెవ్యా దాసమామ్రవటికా వా ఆరామో వా దానగృహం వా యద్వాప్యన్యత్కించిద్గణ్యతే తస్యా దేవ్యాస్తాని (3)ఏవం (విజ్ఞప్తిః) ద్వితీయస్యా దెవ్యా ఇతి తీవరమాతుః కారువాక్యాః

తెలుగు :

## రాణి కారువాకి దానాలు

(1) దేవానాంప్రియుని వచనంగా అన్ని స్థలాలలోని మహామాత్రులు ఇట్లా చెప్పబడాలి. (2) మామిడితోటలు కాని, ఇతర ఆరామాలు కాని, దానగృహాలు కాని ఏవేవి రెండోరాణి దానాలుగా ఒసగిందో అవన్నీ ఆ రాణి పేరనే గణింపబడాలి (3) తీవరుని తల్లి అయిన కారువాకి అనే రెండోరాణి ఇట్లా కోరుతున్నది.

## కౌశాంబీ స్తంభశాసనం

## అలహాబాదు - కోసం స్తంభం

(గమనిక · ఈ శాసనం, స్తంభంమీద, పైనకనుపరచిన రాణిస్తంభ శాసనం తరువాత ఉన్నది)

ప్రాకృతమూలం :

౧ (1) దెవానాంపియే ఆనపయతి (2) కోసంబియం మహామాత

౨ సమగే కటె (4) సంఘసి నొ లహియే

3. .. .... . సంఘం భాఖతి ఓఖు వా భిఖుని వా సే పి చా

౪ ఓదతాని దుసాని సనంధాపయితు అనావాససి ఆవాసయియే.

సంస్కృతం :

(1) దేవానాం ప్రియః ఆజ్ఞాపయతి (2) కౌసాంబ్యాం మహామాత్రా .. ... ... సమగ్రం కృతమ్ (4) సంఘస్య న లభ్యతే ....

సంఘం బినత్తి బిఖుకోవా బిఖుణీవా సోऽపి చావదాతాని దూష్యాణి సన్నిదాప్యానావాస మావాసయితవ్యః.

తెలుగు :

## సంఘ భేదం

(1) దేవానాం[ప్రియుడు ఆజ్ఞాపిస్తున్నాడు (2) కౌసాంబీలోని మహామాత్రులు . సంపూర్ణం చేయబడింది. (4) సంఘానికి పొందడు, . బిక్షుకుడు కాని, బిఖుణీ కాని సంఘాన్ని విడచీస్తే వారికి దూష్యాలైన తెల్లబట్టలను కట్టి మరొకస్థలానికి పంపించివేయవలె.

## సార్నాథ స్తంభం

ప్రాకృత మూలం :

౧ (1) దేవా[నంపియే పియదసి లాజా]

౨. ఏల

3. పాట [లిపుతే] యే కేనపి సంఘే బేతవే (4) ఏ చుం ఖో

౪. బిఖూవా భిఖుని వా సంఘం భాఖతి సే ఓదాతాని దుసాని సంనం దాపయిఁయా ఆనావాససి

౫. ఆవాసయియే (5) హేవం ఇయుం సాసనే బిఖుసంఘసి చ బిఖుని ంఘసి చ వింనపయితవియే

౬ (6) హేవం దేవానాంపియే ఆహ (7) హేదిసా చ ఇకా లిపీ తుఫాకంతికం హువాతి సంసలనసి నిఖితా

౭. ఇకం చ లిపిం హేదిసమేవ ఉపాసకానంతికం నిఖిపాథ (8) తే పి చ ఉపాసకా అనుపోసథం యావు

౯ ఏతమేవ సాసనం విస్వంసయితవే అనుపోసదం చ ధువాయే
ఇకికే మహామాతే పోసథాయే

౯. యాతి ఏతమేవ సాసనం విస్వంసయితవే అజానితవే చ (9)
అవతే చ తుఫాకం ఆహలే

౧౦. సవత వివాసయాథ తుపే ఏతేన వియంజనేన [10] హేమేవ
సవేసు కోటవిషవేసు ఏతేన

౧౧ వియంజనేన వివాసాపయాథా

సంస్కృతం:

[1] దేవా[నం ప్రియః ప్రియదర్శీ రాజా] [2] ఆహ [3] పాట
[లిపుత్రే తథాబాహ్యేషున]గరేషు చ కేనాపి సంఘో భక్తవ్యః [4]
యస్తు ఖలు భిక్షుర్వా భిక్షుకీవా సంఘం భనక్తి సోఽవదాతాని దూష్యాణి
సన్నివాప్యాత్మవాసమావాసయితవ్యః [5] ఏవమిదం శాసనం భిక్షుక
సంఘే చ భిక్షుకీసంఘే చ విజ్ఞాపయితవ్యమ్ [6] ఏవం దేవానాం ప్రియ
ఆహ [7] ఈదృశీ చైకా లిపిర్యుష్మదన్తికే భవత్వితి సంసరణే నిక్షిప్తా,
ఏకాం చ లిపిమీదృశీమేవోపాసకాన్తికే నిక్షిపత [8] తేఽపి చోపాసకా
అనుపోషథం యాంతు ఏతదేవ శాసనం విశ్వాసయితుమ్, అనుపోషథం
చ ధ్రువాయ మేకో మహామాత్రః పోషదాయ యాతి ఏతదేవ శాసనం
విశ్వాసయితుమాజ్ఞాపయితుం చ [9] యావచ్చ యుష్మాక మాహారః
సర్వత్ర వివాసయత యూయమేతేన వ్యఙ్జనేన [10] ఏవమేవ సర్వేషు
కోష్ఠవిషయేష్వేతేన వ్యఙ్జనేన వివాసయత.

తెలుగు :

## సంఘ భేదం

(1) దేవానాంప్రియుడయిన ప్రియదర్శిరాజు (2) చెప్పుతున్నాడు (3) పాటలీపుత్రంలో కాని (దానికి బాహ్యంగా ఉన్న ఇతర నగరాలలో కాని), ఎవ్వడూ సంఘాన్ని విడదీయకూడదు. (4) భిక్షుకుడు కాని, భిక్షుణి కాని, ఎవ్వరైనా సంఘాన్ని విడదీస్తే వారికి తెల్ల బట్టలను కట్టించి వేరొకచోట వాసం చేసేటట్లు చేయవలె. (5) ఈ అనుశాసనాన్ని భిక్షుకుల సంఘానికి, భిక్షుకీసంఘానికి తెలియచేయవలె. (6) దేవానాంప్రియుడు ఇట్లు చెప్పుతున్నాడు (7) ఈ అనుశాసనం యొక్క ప్రతిని ఈ కార్యాలయంలోను, మరివొకప్రతిని ఉపాసకుల గృహంలోను ఉంచవలె (8) ఈ ఉపాసకులు ఈ అనుశాసనంలో విశ్వాసం కలిగిఉండటానికి ఉపవాసదినాలందంతా ఒకచోట కూడవలె. ఈ అనుశాసనంలో విశ్వాసంకల్గి దానిని బోధపరచుకోవటానికి ఉపవాస దినాలలో అంతా మహామాత్రులు కూడా అక్కడికి తప్పక పోతుండవలెను (9) మీ రాష్ట్రం ఎంతవరకు ఉందో అంతదాకా ఒక ఉద్యోగస్థుణ్ణి ఈ ధర్మానుశాసనం ప్రకారం మీరు పంపుతుండవలెను. (10) అట్లాగే, ఈ కింది ఉద్యోగస్థులు కూడా ప్రాంత దుర్గప్రదేశాలలో ఈ ధర్మశాసనాన్ని వినిపించటానికి వారి కింది ఉద్యోగస్థులను పంపుతూ ఉండవలె;

## సాంచీ స్తంభశాసనం

### ప్రాకృత మూలం :

౧. .

౨. యా ఎత [వే] (3) [సం]ఘే మగే కటే

3 భిఖూనం చ భిఖునీనం చా తి పుతప-
౪ పోతికే చందమసూరియికే (4) యే సంఘం
౫ భాఖతి భిఖు వా భిఖుని వా ఓదాతా-
౬ ని దుసాని సనంధాపయితు అనావా-
౭ససి వాసాపేతవియే (5) ఇచా హి మే కిం-
౮ తి సంఘె సమగే చిలఠితీకే సియా తి

## సంస్కృతం :

యా భక్త(వ్యః) (3) సంఘః (స) మగ్రీ కృతమ్, భిక్షుకాణాం చ భిక్షుణీనాం చేతి పుత్రప్రపౌత్రికం చంద్రమ సూర్యకమ్ (4) యో సంఘం భనక్తి భిక్షుర్వా భిక్షుణీ వా అవదాతాని దూష్యాణి సన్నిధాప్యానావాస మావాసయితవ్యః (5) ఇచ్ఛామ్యహం కిమితి సంఘోసమగ్రో చిరస్థితికా అస్త్వితి

## తెలుగు :

## సంఘ భేదం

... విడదీయబడకూడదు. (3) భిక్షుల. భిక్షుణుల సంఘం [నా] పుత్ర ప్రపౌత్రులు ఉన్నంత కాలమూ, చంద్ర సూర్యులు ఉన్నంతకాలమూ సమగ్రం చేయబడింది (4) భిక్షువు కాని, భిక్షుణికాని సంఘాన్ని విడదీస్తే, దూష్యాలయిన తెల్లబట్టలను కట్టి మరొకస్థలానికి పంపించివేయవలె (5) సంఘం సమగ్రంగాను, చిరస్థితికంగాను ఉండవలె అని కోరుతున్నాను.

# స్మృత్యంకిత శాసనాలు

## నిగాలీసాగర (నిగ్లీవా) స్తంభశాసనం

### ప్రాకృత మూలం:

౧. (1) దెవానంపియేన పియదసిన లాజిన [చో] దసవసాభిసితేన

౨ బుధస కోనాకమనస థుబే దుతియం వడితే

3 (2) [వీసతి వ]సాభిసితేన చ అతన ఆగాచ మహీయితే

౪ [శిలాదబే చ ఉస] పాపితే

### సంస్కృతం:

(1) దేవానాంప్రియేణ ప్రియదర్శినా రాజ్ఞా చతుర్దశవర్షాభిషిక్తేన బుద్ధస్య కనకమునేస్తూపో ద్వితీయం వర్ధితః (2) [వింశతివ]ర్షాభిషిక్తేన చాత్మనాగత్య మహియితం [శిలాస్తంభశ్చ] స్థాపితః

### తెలుగు:

#### కనకముని స్తూపం

(1) దెవానాంప్రియ ప్రియదర్శిరాజు తన రాజ్యాభిషేకకాలం పద్నాల్గో సంవత్సరంలో కనకముని బుద్ధుని స్తూపాన్ని పూర్వందానికంటె రెండింతలుగా విస్తరింపచేశాడు. (2) తన రాజ్యాభిషేకకాలం ఇరవయ్యోయేట ఈ స్థలానికి స్వయంగావచ్చి, దానిని పూజించి, ఒక శిలాస్తంబాన్ని నిలిపాడు

## రుమ్మిందై స్తంభశాసనం

### ప్రాకృతమూలం :

౧ (1) దెవానపియేన పియదసిన లాజిన వీసతివసాభిసితేన
౨. అతన ఆగాచ మహీయితే హిద బుధె జాతే సక్యమునీ తి
౩ (2) సిలావిగడభీ చా కాలాపిత సిలాథభే చ ఉసపాపితే
౪ హిద భగవం జాతే తి (3) లుమ్మినిగామే ఉబలికే కటే
౫ అఠభాగియే చ.

### సంస్కృతం :

(1) దేవానాం ప్రియేణ ప్రియదర్శినా రాజ్ఞా వింశతివర్షాభి-షిక్తేనాత్మనాగత్య మహీయితమత్ర బుద్ధో జాతః శాక్యమునిరితి (2) శిలావలభీ చ కారిత శిలాస్తమ్భశ్చోత్థాపితోఽత్ర భగవాఞ్జాత ఇతి (3) లుంబినీగ్రామ ఉద్బలికః కృతోఽష్టభాగీ చ

### తెలుగు :

## బుద్ధ జన్మస్థలం

(1) బుద్ధశాక్యముని ఇక్కడ జన్మించినందువల్ల, దేవానాం-ప్రియ ప్రియదర్శిరాజు తన రాజ్యాభిషేకకాలం ఇరవయ్యో సంవత్సరంలో ఇక్కడికి స్వయంగావచ్చి దీనిని పూజించాడు. (2) భగవంతుడయిన బుద్ధుడు ఇక్కడ జన్మించాడని తెలపడానికి ఇక్కడ ఒక శిలపై ఒక గుర్రంయొక్క శిలావిగ్రహన్ని నిలిపి ఒక శిలాస్తంభాన్ని స్థాపించాడు లుంబినీగ్రామంవారు [ఇతర] పన్నులు చెల్లింప నక్కరలేకుండాను, ఊరి ఫలసాయంలో ఎనిమిదోభాగం మాత్రం చెల్లించేటట్లూ అతను కట్టడి చేశాడు.

# గుహా శాసనాలు

(బారాబర్ గుహలు)

## మొదటి గుహాశాసనం : న్యగ్రోధగుహ

### ప్రాకృత మూలం :

౧. లాజినా పియదసినా దువాడసవసాభి [సితేనా]

౨. ఇయం నిగోహకుభా దినా ఆ [జీ] వికేహి.

### సంస్కృతం :

రాజ్ఞా ప్రియదర్శినా ద్వాదశవర్షాభిషిక్తే నేయం న్యగ్రోధగుహ దత్తా ఆజీవకేభ్యః

### తెలుగు :

ప్రియదర్శిరాజు పట్టాభిషిక్తుడయిన పండ్రెండో సంవత్సరంలో ఈ న్యగ్రోదగుహ ఆజీవకులకు ఈయబడింది

## రెండో గుహాశాసనం : ఖలతిక గుహ

### ప్రాకృతమూలం :

౧. లాజినా పియదసినా దువా-

౨. డసవసాభిసితేనా ఇయం

3. కుభా ఖలతికపవతసి

౪. దినా ఆజీవికేహి

**సంస్కృతం :**

రాజ్ఞా ప్రియదర్శినా ద్వాదశవర్షాభిషిక్తే నేయం గుహా ఖలతికపర్వతే దత్తా ఆజీవకేభ్యః.

**తెలుగు :**

ప్రియదర్శిరాజు పట్టాభిషిక్తుడయిన పండ్రెండో యేట ఖలతిక పర్వతంలోని గుహ ఆజీవకులకు ఈయబడింది.

## మూడో గుహాశాసనం : సుప్రియా గుహ

**ప్రాకృత మూలం :**

౧ లాజ పియదసీ ఏకునవీ-

౨. సతివసాభిసితే జలఘో-

3. సాగమధాత మే ఇయం కుభా

౪. సుపియే స (ఖలతిక పవతసి) ది-

౫. నా

**సంస్కృతం :**

రాజ్ఞా ప్రియదర్శీ ఏకోనవింశతివర్షాభిషిక్తః జలఘోషాగమా-ర్థతః మయా ఇయం గుహ సుప్రియా (ఖలతిక పర్వతే) ఆజీవకేభ్యః దత్తా

**తెలుగు :**

ప్రియదర్శిరాజు తాను పట్టాభిషిక్తుడయిన పందొమ్మిదోయేట ఖలితక పర్వతం మీది ఈ సుప్రియమైన గుహను, జలఘోషాగ-మార్థమై (వర్షాకాలమందు రక్షణకై), ఆజీవకులకు ఇచ్చాడు.

# అనుబంధం

## 1. ఎర్రగుడి లఘుశిలాశాసన పాఠాలు *

( శిల F)

మొదటి లఘుశిలాశాసనం - Minor Rock Edict I

౧ (1) దేవానంపియే హేవాహ (2) అధికాని[1]

౨. య హకం ఉపాసకే (3)సె తు ఖో ఏకం సంవచ్ఛరం ప కా(ం)తే[2]

3. హుసమ్(4)సాతిరేకే చు ఖో సవచ్ఛరే యం మయా సంమే ఉపయీ-

౪. (a) తే బాడం చ మే పకంతే (5) ఇమినా చు కాలేన అ[3]

(b) మిసా (యే) మునిసా[3a]

౫ దెవేహి తే దాని మిసిభూతా (6) పకమస హి

౬ (a) ఇయం[4] (7) [5]మహప్తెనె సకిలె (8) ఖు[6]

(b) ఓకేన పి పక-

---

* ఎపిగ్రాఫియా ఇండికా, XXXIIలో డి.సి.సర్కార్ ఇచ్చిన పాఠాలు.

1 దీని తర్వాత, పొరపాటున, శాసన రచయితో లేక లిపికారుడో 'అడతియాని సంవచ్ఛరాని' అనేమాటలను రాయటంవదిలివేశారు.

2 శాసనశిలలో ఈ ౨వ పంక్తి సంతా కుడినుంచి ఎడమకు చదవాలి.

3 శాసనశిలలో, ఈ పంక్తిలోని 16 అక్షరాలను కుడినుంచి ఎడమకు చదవాలి.

3a శాసనశిలలో ఈ 6 అక్షరాలు కుడినుంచి ఎడమకు చదవాలి

4 దీనితర్వాత 'పలే' అనేమాట పొరపాటున రాయటం వదిలివేశారు.

5 ఇక్కడ 'నోహియం' అనే మాటలను రాయటం వదిలివేశారు.

6 ౬ (a) పంక్తినంతా శాసనశిలలో కుడినుంచి ఎడమకు చదవాలి.

౭ (a) మమీనేస సకియె విపులే స్వగే ఆరాదేతవే ఏతాయ చ అరాయ ఇయం

౮ (సా)వనే సావితే (10) అరా ఖుదక-మహలకా ఇమం పి (ప)క మేవూ అం-

౯. తా చ మే జా నేపు చిర-ఠితికా చ[7]

౧౦. ఇయం పకమే హొత విపులం పి చ వఢసితా అపరధియా దియ ధియమ్.

౧౧ (11) (ఇ)యం చ సావనె సా

౧౨. (వా)పితే వ్యూదేన ౨౦౦ ౫౦ ౬.

రెండో లఘుశిలాశాసనం - Minor Rock Edict II

(1) హే (వం) దేవానం దేవానంపియే ఆహ. (2) యథా దే-

౧౩. వా(నం)పియే ఆహ తథా కటవియే[8]

౧౪ (3) రజూకే ఆనపేతవియే[9]

౧౫. (4) సే దాని జానపద(ం) ఆన-[10]

౧౬. పయిసతి రఠికాని చా. (5) మాతా-పితూసు సుసు

౧౭. సితవియే (6) హేమేవ గరూసు సుసుసితవియే. (7) ప్రా(పా) నేసు దయితవియే (8) సచే వతవియే. (9) ఇ-

౧౮ (a) మ ధంమ-గునా పవతితవియా (10) హేవం తుంఫే ఆనపయాద దేవానంపియ వచనేన. (11) హే-

---

7 ౯ పంక్తి నంతా శాసనశిలలో కుడినుంచి ఎడమకు చదవాలి

8 శాసనశిలలో ఈ పంక్తిని కుడినుంచి ఎడమకు చదవాలి.

9 శాసనశిలలో ఈ పంక్తిని కుడినుంచి ఎడమకు చదవాలి.

10 శాసనశిలలో ఈ పంక్తిని కుడినుంచి ఎడమకు చదవాలి.

(b) వం ఆనప[11]

౧౯. యథా హదియారోహాని కా(ర)నకాని యుగ్యాచరియాని బంభనాని చ తు(౦)పే (12) హేవం నివేసయా-

౨౦. (a) థ అంతేవాసిని యారిసా పారానా పకితి (13) ఇయం సుసుసితవియే. (14) అపచాయనా య వా ఆచరి య స

(b) (హే)మేవ[12]

౨౧ (15) యథా వా పున ఆచరియస నాతికాని యథారహం నతికాసు ర్వ (ప్ర)వతితవియే (16) హేసా పి

౨౨ (అం)తేవాసీసు యథారహం పవతితవియే యారిసా పారానా పకితి (17) యథారహం యథా ఇయం

౨౩. సతిరో(రే)కే సియా హేవం తు(౦)ఫే అనపయాథ నివేస(యా)థ చ అంతేవాసిని. (18) హేపం దే-

౨౪. వానంపియే అనపయతి [13]

---

11 శాసనశిలలో ఈనాలుగు అక్షరాలను కుడినుంచి ఎడమకుచదవాలి.

12 శాసనశిలలో ౨౦ వ పంక్తి చివరఉన్న ఈ మూడు అక్షరాలను కుడినుంచి ఎడమకు చదవాలి.

13 శాసనశిలలో ఈ పంక్తిని కుడినుంచి ఎడమకు చదవాలి.

## 2. అశోకుని గ్రీకు - అరమెయిక్ ద్విభాషా శాసనం

(కంధహర్, ఆఫ్ఘనిస్తాన్.)

[ గ్రీకు, అరమెయిక్ లిపిలోని పాఠాలకు, రోమన్ (ఇంగ్లీషు) లిపిలో రాసిన పాఠం (transcription), వాటి ఇంగ్లీషు అనువాదం, J. Filliozat, "Graeco - Aramaic Inscription of Asoka near Kandahar," *Epigraphia Indica* Vol XXXIV, PP 1-8 నుంచి

గ్రహించబడినాయి ఇక్కడ వాడిన రోమన్ (ఇంగ్లీషు) లిపిలోని అక్షరాలు, గ్రీకు,అరమెయిక్ లిపిలోని అక్షరాలకు దగ్గరైనవి మాత్రమే యదాతథంగా ఆ శబ్దాలను ప్రతిబింబించవు

ఈ గ్రీక్, అరమెయిక్ శాసనపాఠాలు. అశోకుడు, పాటలీ పుత్రంనుంచి, అఫ్ఘనిస్థాన్‌లోని స్థానిక అధికారులకు, ధర్మాన్నిగూర్చి పంపిన కొన్ని ఆదేశాలకు, అనువాదాలుగా కనుపడుతాయి. అవి, నేటికి భారతదేశంలో లభించిన ఏ ఒక్క శాసనానికి ప్రతిపదానువాదంగా కనపడవు ఒక పండితుడు (లామొట్) సూచించినట్లు, అవి, అశోకుడు తన 14వ శిలాశాసనంలో పేర్కొన్న సంక్షిప్త లేఖనాలు ("సంక్షిప్తేన లేఖాపిత") అయి ఉండవచ్చు. ఈ శాసనాలు, ఒకటవ, నాల్గవ శిలాశాసనాలలోని విషయాలకు సారభూతంగా ఉన్నాయి ]

*GREEK*

1 deka et^n plere (thent) on basileus
2 Piodasses eu'sebeia(n) e' 'deixen tois a'n-
3 thropois, kai 'apo toutou eu'sebesterous
4 tous a'nthropous e'poisen kai panta
5. eu'thene i kata pasan gen, kai a'pekhetai
6 basileus ton e'mpsukhon kai oi loipoi de
7 anthropoi kai 'osoi thereutai 'e a'lieis
8 basileos pepauntai thereuontes, kai
9 e'i tines a'krateis, pepauntai tes a'kra-
10 sias kata dunamin, kai e'nekooi patri
11 kai metri kai ton presbuteron para
12 to proteron, kai tou loipou loion
13 kai a'meinon kata panta tauta
14 poiountes dioxousin

## *ENGLISH TRANSLATION*

Ten years having elapsed (*from his installation*), King Piodasses has shown mankind (*the way to*) piety And since then he has rendered mankind more pious, and everything is thriving on the whole earth And the King abstains from animals (i e , meat), and all men including the King's huntsmen and fishermen have stopped hunting. And those who could not control themselves have ceased to so as far as they could And (*having become*) obedient to father and mother and to the elders, contrary to what happened before, they will, henceforward, by thus acting, lead a better and in every way more profitable life

## *ARAMAIC TEXT* (English transliteration)

1 *sh*nn 10 ptytw 'byd zy mr'n Prydr*sh* mlk' q*sh*yṭ mhq*sh*ṭ
2 mn 'dyn z'yr mr' lklhm 'n*sh*n wklhm 'dw*sh*y' hwbd
3 wbkl 'rq' 'm*sh*ty w'p zy znh bm'kl' lmr'n mlk' z'yr
4 qtln znh lmhzh klhm 'n*sh*n 'thḥsynn 'zy nwny' ḥdn
5 'lk 'n*sh*n ptyzbt knm zy prbst hwyn 'lk 'thḥsynn mn
6 prbsty whwptysty l'mwhy wl'bwhy wlmzy*sh*ty' n*sh*n
7 'yk 'srhy ḥlqwt' wl' 'yty dyn' lklhm' 'nshy' ḥsyn
8 znh hwtyr lklhm 'n*sh*nw w'wsp yhwrt.

## *TRASLATION*

(Line 1) Ten years having elapsed (?), it happened (?) that our Lord Priyadaiśi, the King became the institutor of Truth

(Line 2) Since then, evil diminished among all men, and all misfortunes(?) he caused to disappear,

(Line 3) and upon all the earth (*there are*) peace (*and*) joy And further more, (*there is*) this about food for our Lord, the king

(Line 4) a few (*animals*) are killed, seeing this, all the men

ceased (*killing animals*), even(?) those who catch fish (i e the fishermen),

(Line 5) these men are subiect to prohibition Similary, those who were without restraint have ceased

(Line 6) to be without restraint And (*there reigns*) obedience to one's mother and to one's father and to old people

(Line 7) according to the obligations set on every one by fortune And there is no Judgement for all pious men

(Line 8) This (*i e the practice of the Law*) has been profitable for all men and shall be still profitable

## 3. అశోకుని నూతన గ్రీకు భాషా శాసనం

(కంధహార్, ఆఫ్ఘనిస్థాన్)

[12వ శిలాశాసనంలో అధికభాగం, 13వ శిలాశాసనంలో మొదటిభాగం లోనివిషయాలు గ్రీకులిపిలో ఉన్న ఈగ్రీకుభాషాశాసనంలో పొందుపరచబడినాయి. ఈగ్రీకు శాసన పాఠానికి కింద ఇచ్చిన ఇంగ్లీషు అనువాదం, D Schlumberger & E Benviniste, "A New Greek Inscription of Asoka at Kandahar," *Epigraphia Indica,* Vol XXXVII, Pp 193-200 నుంచి గ్రహించినది.]

*ENGLISH TSANSLATION*

piety and self-control in all schools of thought Now he is most master of himself who con trols his tongue And may they neither praise themselves nor blame other (schools) about anything, for this is vain, and it is better to praise other (schools) and to abstain from blaming them in any respect In so doing they will extol themselves and gain the favour of the

other(schools), in transgressing this, they will harm their reputation and estrange other (schools) They who praise themselves and blame other(schools)behave in a rather conceited way, in striving to outshine others they rather do harm to themselves It is fit that people respect each other and accept each other's teachings In so doing they will grow in knowledge, transmitting to each other whatever each of them know And there should be no hesitation in saying so to those who act accodrngly' so that they will ever keep on living piously

In the eight year of his reign Piodasses overwhelmed Kalinga One hundred fifty thousand persons were captured and deported, a hundred thousand others were killed and about as many died From that time on he was overcome by pity and compassion, and it weighed on his mind Just as he had given orders to abstain from (consuming) living beings' he has been zealous in organizing piety And this he took with even more grief, the brahmans and sramans and all others who lived there (in Kalinga) practising piety,— those who lived there had to mind the king's interests, to revere and respect master, fathers and mothers, to love and refrain from deceiving friends and companions, to treat as gently as possible slaves and servants,— if, of all those who thus behaved some died or was deported, this too others felt it as a personal sorrow, and the King was deeply afflicted there by And, as amongst all other nations there are

